# గృహవైద్య చికిత్సారత్నము.

(ప్రథమభాగము)

పురాతన తాళపత్ర గ్రంథములనుండి

రాజవైద్య: మంగవల్లి రంగయ్యగారిచే

సమకూర్పబడినది.




ప్రకాశకులు:

కురుకూరి సుబ్బారావు

సరస్వతీ బుక్ డిపో,

బెజవాడ.





కాకినాడ

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపబడినది.

1934




వెల రు 1—0—0

# ఆదిభట్ల నారాయణదాసుగారిచే
# రచియింపఁబడిన హరికథలు.

| | | | |
|---|---|---|---|
| జానకీశపథము | 1- 0-0 | గజేంద్రమోక్షము | 0- 8-0 |
| రుక్మిణీకల్యాణము | 0-12-0 | ప్రహ్లాదచరిత్రము | 0- 8 0 |
| మార్కండేయోపాఖ్యానం | 0-12-0 | పైన 8 పుస్తకములు కలిసిన క్యాలికో బయిండు | 5- 8-0 |
| హరిశ్చంద్రోపాఖ్యానం | 0-12-0 | సావిత్రి చరిత్రము | 0-12-0 |
| అంబరీషచరిత్ర | 0- 8-0 | యథార్థ రామాయణం | 2- 8-0 |
| భీష్మచరిత్రము | 0- 8-0 | | |

## బి. బాలాజీదాసుగారిచే రచియింపఁబడిన హరికథలు.

| | | | |
|---|---|---|---|
| గయోపాఖ్యానం | 0- 8-0 | | |
| జయప్రదాదేవిచరిత్ర | 0- 8-0 | సంగ్రహరామాయణం | 1- 0-0 |
| నలచరిత్రము | 0- 8-0 | ద్రౌపదీమానసంరక్షణ | 0- 6-0 |
| రుక్మాంగదచరిత్ర | 0- 8-0 | కుచేలోపాఖ్యానము | 0- 6-0 |
| త్రిశంకువిజయమను హరిశ్చంద్ర | 0- 8-0 | పురందరదాసుచరిత్ర | 0- 6-6 |
| కుశలవవిజయము | 0- 8-0 | సూరదాసుచరిత్ర | 0- 6-6 |
| శశిరేఖాపరిణయము | 0- 8-0 | కర్ణానందదాయిని | 0- 6-6 |
| సీతాకల్యాణము | 0- 8-0 | హరికథేతిహాససమంజరి పా I పద్యములు | 0- 6-0 |
| దయాకరవిజయం | 0- 8-0 | డిటో రెండవభాగం కీర్తనలు | 0- 6-0 |
| భద్రాచల రామదాసుచరిత్ర చల్లా రామలింగయ్యగారిది | 0- 6-0 | | |

## తిరునగరి శేషదాసుగారి హరికథలు.

| | | | |
|---|---|---|---|
| శ్రీరామపాదుకాపట్టాభిషేకము | 0- 8-0 | శ్రీమదుత్తరరామచరిత్ర | 0- 8-0 |
| సీతాపహరణము | 0- 8-0 | సుభద్రాపరిణయము | 0- 8 0 |

## బాబూ. పి. యస్. నౌషర్ వాన్జీకవిగారిచే రచియింపఁబడిన

| | | | |
|---|---|---|---|
| శ్రీకబీరుదాసుచరిత్ర | 1- 0-0 | సీతాకల్యాణము | 1- 4-0 |
| శ్రీరామజననము | 1- 0-0 | వైజయంతీవిలాసము | 1- 0-0 |

వలయువారు:—

 సరస్వతీ బుక్ డిపో., బెజవాడ.

# గృహవైద్య

# చికిత్సారత్నము

(ప్రథమ భాగము.)



పురాతన తాళపత్ర గ్రంథములనుండి

**రాజవైద్య: మంగవల్లి రంగయ్యగారిచే**

సమకూర్పబడినది.

ద్వితీయకూర్పు 2000 ప్రతులు.

ప్రకాశకులు:-

**సరస్వతీ బుక్ డిపో,**

**బెజవాడ.**

కాకినాడ:

కాకినాడముద్రాక్షరశాలయందు,

ముద్రింపఁబడియె.

**1931.**

 [వెల 1-0-0.

# రంగూన్ రౌడీ అను పతిభక్తి.

(గ్రంథకర్త:—సోమరాజు రామానుజరావుగారు.)

పల్లెలలో రౌడీ-పట్టణములలో రౌడీ- వీధులలో రౌడీ-విపణికలలో రౌడీ-సంతలలో రౌడీ-చావిళ్లలో రౌడీ-సందులలో రౌడీ-సభలలో రౌడీ-గుళ్ళలో రౌడీ-గృహములలో రౌడీ-కక్షలలో రౌడీ- కలహములలో రౌడీ-కోర్టులలో రౌడీ- పార్టీలలో రౌడీ- దొంగలలో రౌడీ- దొరలలో రౌడీ-హత్యలలో రౌడీ-నృత్యసభలలో రౌడీ-సరుకులలో రౌడీ సరసములలో రౌడీ- ఈరౌడీలలో మనరౌడీ యెవ్వరు?

మనరంగూన్ రౌడీ-సర్వసద్గుణాలంకారుడు-సమస్తజనభయంకరుడు! మొదటిదెబ్బతో రంగారావుకు మోక్షమిచ్చిన రౌడీ! పోలీసువారికి చిక్కకుండ పోగయోడనెక్కి-నరవుడీ- సముద్రమధ్యమున-మొసలిపట్టినను చావనిరౌడీ-రక్షించిన రమేశదంపతులతో రంగూను చేరినరౌడీ- అన్నముబెట్టినదాతకు సున్నముబెట్టినరౌడీ- ప్రాణదాత భార్యతో ప్రణయప్రసంగములాడించిన రౌడీ-రమేశునిచంపి యాతని భార్యతో రంగూనువిడిచిన రౌడీ- చెడతాగి ప్రభావతిచేతికి చిప్ప యిచ్చినరౌడీ- బంధింపవచ్చిన మామకు ప్రాణమోక్షమిచ్చిన రౌడీ- తనయపరాధములన్నిటిని తలనిడుకొనినభార్యను గాంచి పశ్చాత్తాపముపాలైనరౌడీ-ఘోరమరణశిక్షకు పాల్పడిన భార్యకొరకై గుండె బద్దలైనరౌడీ-మనరంగూను రౌడీ అన్నిరసములలోనున్నాడు. అన్ని యనుభవములలో నున్నాడు. అన్నిఅంకములలోనున్నాడు! మహోద్భుతముగల్గించి మనరవుడీ చదువరులగుండెలను దడదడలాడించినాడు! పకపకనవ్వించినాడు- బొటబొట కన్నీరుగార్పించినాడు!-శృంగారచేష్టలతో సుఖానుభవము నొందించినాడు!

ఆంధ్రదేశమునందలి అన్నిపట్టణములవారికిని ఆనందమును గల్గించి యెప్పుడు ప్రకటితమగునా యని యెదురుచూడబడుచున్న రంగూన్ రవుడీ నేటికి ముద్రింపబడి సిద్ధముగనున్నది!- రసభరితములగు పద్యములు!-రమ్యములగు పాటలు, తప్పక యింటనుంచుకొనిన హంతకులయొక్కగాని దొంగలయొక్కగాని మోసగాండ్రయొక్కగాని భీతిలేకుండ కాపాడగల మారంగూన్ రవుడీ! 1 రూపాయికిమాత్రమే లభింపగలదు. వలయువారు:—సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.-

# విషయసూచిక.



# గృహవైద్యచికిత్సారత్నము.

## ప్రథమ భాగము.

### 1 అతి మూత్రమునకు చికిత్స:.

మినుములు, బెల్లము, పాముపొట్ట, జీడివిత్తులు, నెయ్యి, వీనిని, సమానభాగములు చేసి, పోక చెక్కలంత వుండలు చేసి, ప్రతిప్రాతఃకాలమునను యివ్వవలెను.

### 2 ఇంకొక ప్రక్రియ.

జాజికాయలు, జాపత్రి, లవంగాలు, కురాసానివామం, జీడిగింజలు, వేపాకు, జీడిగింజలు కుండలో వేసి, కషాయముపెట్టి, గింజలు తీసివేసి, పైదినుసులున్ను, విత్తులున్ను సమభాగములు చేసి, సేరు బెల్లముతో దినుసులున్ను కలియనూరి, రేగుపండంత వుండలు చేసి, ప్రతిఉదయం యివ్వవలెను.

### 3 వేరొక ప్రక్రియ.

20 జీడిగింజలు, 3 తవ్వలపాలలో చెక్కలు చేసి పడవేసి, మానెడుగా కాగనిచ్చి, ప్రతి ఉదయమూ దాహమిూయవలెను.

### 4 మేహశూల చికిత్స,

గిద్దెడుగార చెక్కరసము, పావుతులం జీలకర్ర, తులం పంచదార, వేసి త్రాగించవలెను.

### 5 వాతశూల చికిత్స.

గిద్దెడు దిరిశెన చెక్కరసము, తులము మిరియాలు నూరియివ్వ వలెను.

### 6 శంఖద్రావకము.

16 పాళ్ళు పటిక, 12 పాళ్ళసోరుప్పు, 18 పాళ్ళసైంధవలవణం నిమ్మపండ్ల రసముతో బట్టీ యంత్రాన, ద్రావకము తీసి, అల్లపురసం పంచదార అనుపానంతో సేవించవలెను.

### 7 కుసుమకు క్రియ.

ఎర్రకలువ దుంపరసములో 1 తులం పిప్పళ్లు కలిపినూరి, శుభ్రముగా ఉడికించి 3 దినములు యివ్వవలెను. 3 దినములు పైపథ్యం, ఆవు మజ్జిగతో, చప్పిడిపథ్యం.

### 8 ఇంకొకక్రియ.

తెల్లకాచు 1 డబ్బెత్తు చూర్ణముచేసి, 1 గిద్దెడు ఆవునేతిలో కలిపి 3 దినములు వెనుకటివలెనే పథ్యముతో యిచ్చేది.

### 9 వేరొకప్రక్రియ.

దేహజన్యములగు మేహవ్యాధులు, మూత్రబంధము, మొగుపునకు, తెలుపునకు, మధుమేహమునకు క్రియలు.

5, 6, చిన్నాలపటిక చూర్ణముచేసి, వెన్నతోపొదిగి, ఒకమండలము దినములు ఇచ్చినచో, మధుమేహము శాంతించును.

### 10 మరియొక ప్రక్రియ.

ఏనుగిపల్లేరు ఆకుగాని, గుమ్మడిఆకుగాని, అరసోలెడుమంచి నీళ్ళలో శుభ్రముచేసి, ఆకుతీసివేసి, ఆనీటిలో ఉసిరికాయంత నేలఉసిరికఆకునూరి కలిపి జీలకర్ర 1 తులము పంచదారకలిపి యిచ్చినచో, మేహము, మూత్రకృచ్ఛ్రము నివారించును.

11 భోజనమైన వెంటనే వాంతియైనచో.

5 చిన్నముల జీలకఱ్ఱ, 10 చిన్నముల ఉసిరికపప్పు, 10 చిన్నముల శొంఠి, నిమ్మరసముతోనూరి, 3 తోలల పెరుగులో కలిపి ప్రతి దినం, నెలదినము తీయవలెను.

12 ఎక్కిళ్ళకు శాంతి.

20 చిన్నములు బచ్చలి ఆకురసము, 20 చిన్నముల తేనె, 20 చిన్నముల జీలకఱ్ఱ కలిపి యివ్వవలెను.

13 శూలకు క్రియ.

పొడుగుగా కాకరకాయను చీరి, గింజలు తీసివేసి, ఇంగువ 10 చిన్నములునూరి, కాయలోవేసి, 10 చిన్నముల సురేకారము చూర్ణముచేసి కాయలోవేయవలెను. పంచదార 10 చిన్నములున్నూ కాయలోవేసి 3 న్ను పుటమువేసి తీసి నూరి యివ్వవలెను.

14 గ్రహణికవాటము.

10 కొడిశపాలు, 10 చిన్నాల అతివస, 10 చిన్నాల బిల్వ శొంఠి, 10 చిన్నాల మిరియాలు 10 చిన్నాలవేరు జాజిపూవులు 10 చిన్నాల తంగేడు యిగుళ్లు, 20 చిన్నాల చింతగింజల బెరడు. 10 చిన్నాల బూరుగుజిగురు, 10 చిన్నాల లవంగాలు, 10 చిన్నాలగంజాయి జడ 10 చిన్నాల జాజికాయ, 10 చిన్నాల జాపత్రి 20 చిన్నాల నల్లమందు, 40 చిన్నాల మెంతులు దానిమ్మ పింజలో పెట్టి పుటమువేసి, ఉడుకనిచ్చి, రేగుగింజలంత మాత్రలుచేసి, ఇవ్వవలెను. జ్వరసమయమున అనుపానము మంచినీళ్లు, కానిచో పెరుగుగాని, గంజిగాని.

15 ఇంకొక ప్రక్రియ.

లేతపాకముగా వేయించి, చల్లతోనూరి, వుడికించి యివ్వవలెను.

1 గర్భశూలలకు, 2 నెలలకాలమునకు లక్షణము.

మొదటినెలకు:—అరచేతులు కాళ్లు మంటలు, ఇందుకు క్రియ

వట్టివేళ్ళు, శ్రీగంధము, తామరతూండ్లు, అల్లిదుంపలు, ధరణపుతూని కను గోక్షీరముతో, పానము చేయించవలెను. యోనిని చమరవలెను.

2వ నెలకు:—కడుపు నొప్పిగా నుండును. అల్పాచపూనము కల్లెలవలెపడును. ఇందుకుక్రియ: గొట్టుదుంపలు, ఏలకులు, కోష్టువు, ధరణపు తూనికను గోక్షీరముతో పానము చేయించవలెను.

3వ నెలకు:—కడుపుపారుట, కండ్లుచీకటిగల్గుట, ఇందుక్రుకియ, గొట్టుదుంపలు, తామరతూండ్లు, అల్లిదుంపలు, ధరణపు తూనికను గోక్షీరముతో పానము చేయించవలెను.

4వ నెలకు:—రక్తము కెరళ్ళవలెపడును, కడుపునొప్పి గల్గును, యోనిచమర్చును, ఇందుకుక్రియ, పల్లేరువేళ్ళు, శొంఠి, శ్రీగంధము, గోక్షీరముతో పానము చేయించవలెను.

5వ నెలకు:—రక్తము ద్రవముగా పడును. ఇందుకు క్రియ, తక్కోలం, గొట్టెదుంపలు, గోక్షీరముతో పానము చేయించవలెను. ఈ నెల, నడికట్టులో నొప్పిగానుండును. దీనికిక్రియ, కలువ పూవులు, శ్రీగంధముతో తాగించవలెను.

6వ నెలకు:—కడుపునొప్పి, అన్నారోచకము, ఏమైనను తిన బోయి హితవు గాకపోవుట. ఇందుకుక్రియ, పిప్పళ్ళు, ద్రాక్షపండ్లు, కర్పూరము క్షీరముతో పానము చేయించవలెను. ఈ నెలలో కడుపు పారును, దీనికి కూడ పైన చెప్పినదే క్రియ.

7వ నెలకు:—బిడ్డకుట్టు యెత్తును, వెంకినచ్చును. ఇందుకు క్రియ, మేడిచెక్క, తులసి, పంచదార, క్షీరముతో పానముచేయించవలెను. ఈ నెలలో కన్నులు కుట్టును, వెంకివచ్చును, ఆహారమిష్టము కాదు. ఇందుకు క్రియ, తక్కోలము ఆవుపాలతో త్రాగించవలెను.

8వ నెలకు:—గర్భమున గొప్పనొప్పి ప్రారంభమగును. ఎక్కిళ్ళు వచ్చును. బిడ్డకుట్టువచ్చును. ఇందుకుక్రియ, మేడిచెక్క తులసి

పంచదార గోక్షీరముతో పానముచేయించవలెను. ఈనెలను కాళ్ళు చేతులు నొప్పిలేచును. కడుపు నొప్పిగానుండును. ఇందుకుక్రియ, కలువపుష్పాలు, పంచదార యిప్పపువ్వు, పెసలు, గోక్షీరముతో పానముచేయించవలెను.

9వ నెలకు:—కడుపు నొచ్చును. ఇందుకు క్రియ తక్కోలము, వట్టివేళ్ళు, గోక్షీరముతో, త్రాగించవలెను. ఈనెలలో కరపాదములు నొచ్చును. దీనికి, కలువపూవులు, పెసలు, ఇప్పపూవులు ఆవుపాలతో త్రాగించవలెను.

17 నాడీస్థానములు.

సకలవ్యాధులను, 8 స్థలములను పరిశీలించి అవి 1 నాడి 2 దేహమును స్పృశించుట, 3 ఆకృతి, 4 వాక్కు, 5 నేత్రములు, 6, 7 మలమూత్రములు, 8 నాలుక.

18 నాడియుండు స్థలములు.

కర, పాద, మూలములందు నాడి యుండును. స్త్రీలకు వామభాగపరీక్ష యుక్తము. పురుషులకు దక్షిణభాగము.

19 వాత, పిత్త, శ్లేష్మ, నాడుల నిదానము.

వాత, పిత్త, నాడులు, మొదటి వ్రేలిక్రింద నడుచును. శ్లేష్మనాడి, నడిమి వ్రేలిక్రింద నడుచును. వీనిని దాటినడిచెనా, ఆశ్చర్యనాడియని తెలిసికొనవలెను.

20 వాతనాడీ నిదానము.

వాతనాడి వక్రముగా నడుచును. సర్పవలెగాని, లావుకవలెగాని, పామువలెగాని, చిన్నపిల్లల జోలికవలెగాని నడుచును.

21 పైత్యనాడీనిదానము.

ఇది చపలగతి గలది. ఊరపిచ్చుకవలెగాని, నెమలివలెగాని, హంసవలెగాని గువ్వవలెగాని నడచును.

## 22 శ్లేష్మనాడీనిదానము.

ఇది స్థిరమైన నడకగలది. కోడివలెగాని, పావురమువలెగాని, ఊరపిచ్చుకవలెగాని, లకుముకివలెగాని నడుచును.

## 23 పిత్తశ్లేష్మనాడి.

ముందు పామునడక, వెంటనే కప్పనడకగలది పిత్తశ్లేష్మనాడి యనబడును.

## 24 వాత పైత్యనాడి.

ముందు లావుకవలెను, వెంటనే నెమలివలెను నడిచినట్లయిన వాతపిత్తనాడి యనబడును.

## 25 వాతశ్లేష్మనాడి.

ముందు కోడివలెను. వెంటనే జలగవలెను నడిచినట్లయిన వాతశ్లేష్మనాడి యనబడును.

## 26 అజీర్ణనాడి.

మదపుటేన్గవలె నడిచినట్లయిన అజీర్ణనాడియగును. నిద్రించిన కాకివలె నడిచినట్లయిన దీపకనాడియగును. ఇట్లే స్త్రీసంగమనాడి యగును. కాని కొంచెము తీవ్రముగ నడిచి తిరిగి హంసవలె నడుచును. ఇవియన్నియు అజీర్ణనాడులు.

## స్పర్శలక్షణము.

వాతధాతువు గల్గినవానికి శరీరము వేడిగా నుండును. పైత్యరోగికి జ్వర మధికముగానుండును. లేకున్న అతి శీతలముగా నుండును. శ్లేష్మరోగికిని చల్లగానుండును. ద్వంద్వరోగికి అనేకవిధములుగా నుండును. ఇది స్పర్శలక్షణము.

## 28 స్వరూపలక్షణము.

శరీరము సన్నిపాతములకు వివర్ణమగును.

## 29 శబ్దలక్షణము.

పైత్యరోగికి, మాటలు పెద్దవిగానుండును. శ్లేష్మరోగికి హీనస్వరముగా నుండును. ద్వంద్వరోగికి అనేకవిధములుగా నుండును.

## 30 నేత్రపరీక్ష.

కన్నులు నల్లనై యున్నను, నొప్పిగానున్నను,నీళ్లుకారినను వాతధాతువులుగా నెఱుగవలెను. కన్నులు ఎర్రగానున్నను,పచ్చగానున్నను సన్నిపాతమని యెఱుగవలెను. కన్నులు పచ్చనైయున్న కామెర్లని తెలిసికొనవలెను. కన్నులు ఎర్రనైనచో పైత్యలక్షణమనియు,కన్నులు పుసికట్టి తెల్లవారియుండెనా శ్లేష్మ లక్షణమనియు, నెఱుగవలెను.

## 31 మలపరీక్ష.

వాతరోగికి మలబద్ధకము గల్గియుండును. కాకున్న కొంచెము నల్లబారియుండును. పైత్యరోగికి పచ్చని మలముగాని, ఎర్రనిమలముగాని, యుండును. ద్వంద్వరోగికి మిశ్రమమై యుండును.

## 32 మూత్రపరీక్ష.

వాతరోగి తెల్లనిమూత్రము విడుచును. పైత్యరోగిమూత్రము, ఎర్రగాగాని, పచ్చగాగాని, యుండును. శ్లేష్మరోగికి నురగలు పడును. ద్వంద్వరోగి మిశ్రమముగ విడుచును.

## 33 మూత్రపరీక్షా లక్షణము.

పెంకులో మూత్రమునుబట్టి, ఎండలోనుంచి, నీడకు దెచ్చి దానిలో నూనె చుక్క వేయవలెను. నూనెగీతవలె పొడుగుగా వచ్చినచో వాతజ్వరము. ఆనూనెబొట్టు కదలుచున్నచో పైత్యజ్వరము. కదలకున్నచో శ్లేష్మజ్వరము. పైమూడులక్షణములు నున్నట్లయిన సన్నిపాతము.

### 34 అసాధ్యమూత్రిరోగలక్షణము.

అసాధ్యములగు వ్యాధులకు మూత్రిముపట్టి నూనెచుక్క వేసిన చో, తమలపాకువలె నున్నను, నీళ్ళకడవవలె నున్నను, సన్నిపాతము.

మూత్రిములోని నూనె ఏస్గవలెనున్నను, కోతివలెనున్నను, రోగము అసాధ్యము.

మూత్రిములోనినూనె, గ్రిద్దవలెనున్నను, తాబేలువలె నున్నను, జింకవలెనున్నను, సింహమువలెనున్నను, పందివలెనున్నను, నాగుబాముపలె నున్నను, కోతివలెనున్నను పిల్లివలెనున్నను, తేలువలెనున్నను, రోగము అసాధ్యము.

### 35 సాధ్యమూత్రిలక్షణము.

మూత్రములోనినూనె పద్మమువలెగాని, గొడుగువలెగాని, శంఖమువలెగాని, రుద్రిణివలెగాని, సింహాసనమువలెగాని, మల్లెమొగ్గవలె నుండనీ, ఈగుణములున్నచో రోగము సాధ్యమగును.

### 36 జిహ్వాలక్షణము.

నాలుక పగులుటయు ముండ్లుగల్గి పచ్చనైనను, వాతధాతువు. నాల్క ఎఱ్ఱనైనను, నల్లనైనను, పైత్యలక్షణము. నాలుకదళమై తెల్లనై యున్నను, శ్లేష్మజ్వరము. నాల్కపై ముండ్లులేక, దళము గాక, నల్లగానున్నచో సన్నిపాతము. నాలుక మిశ్రివర్ణమైయున్న ద్వంద్వరోగము.

### 37 అజీర్ణజ్వర నిదానము.

అజీర్ణములు 4 విధములు, 1 రసశేషము, 2 విస్ఫష్టము. 3 విధూమము, ధూమము.

#### నిదానము.

1 రసశేషమునకు తలనొప్పి, 2 విస్ఫష్టము. శరీరమంతయు నొప్పిగల్గియుండును. 3 విధూమము పులితేన్పులు వచ్చును. 4 ధూమము స్వభావపు త్రేన్పులు వచ్చును. ఈనాల్గును అజీర్ణజాతులు.

## 38 జ్వరజన్యలక్షణము.

రోగములలో జ్వరము రాజువంటిది. జ్వరములు 7 విధములు. ఇవి వాత, పైత్య, శ్లేష్మ, భూత, అజీర్ణ, అభిఘాత, ద్వంద్వ, జ్వరములను భేదములుగలవి.

## 39 పైత్యజ్వరము.

నిద్రివచ్చుట, పొరుట, పురీష మెఱ్ఱగాయుండుట, కల్లలుపల్కుట, దాహాధిక్యత, మూర్ఛ, నోరెండుట, నోరు చేదగుట. చెమ్మటలు బోయుట వాంతిగల్గుట, వెక్కిళ్లుగల్గుట. పైత్యజ్వరలక్షణములు.

## 40 శ్లేష్మజ్వరము.

మొగము తెల్లనైయుండుట, రొమ్మునొప్పి, దగ్గు, ఉబ్బసము, పడిశము, వాంతి, వెక్కిళ్లు, కుత్తుకనొప్పి, దాహము, ఎగయూర్పు, శీతుగల్గుట శ్లేష్మజ్వరలక్షణములు.

## 41 వాతపైత్యజ్వరము.

ఒడలు నొప్పులు, ఉబ్బసము, దగ్గు, ముఖము తెల్లబడుట, కుత్తుకనొప్పి, గగుర్పాటు, అలసట, వాతపైత్యజ్వరలక్షణములు.

## 42 పిత్తశ్లేష్మ జ్వరనిదానము.

చెమ్మటలుగల్గుట, అబద్ధమాడుట, మత్తుగల్గుట, దేహముగగుర్పాటుజెందుట, దగ్గువచ్చుట, రొమ్మునొప్పి, నరములు తపించుట, పిత్తశ్లేష్మ జ్వరలక్షణములు.

## 43 భూతజ్వరనిదానము.

పిచ్చిపిచ్చిమాటలాడుట, నేత్రములు పెద్దవగుట, తీవ్రమైన జ్వరమువచ్చుట, ప్రలాపములుగల్గుట, విశేషశక్తి పెంపుగల్గుట, తనువున గగుర్పాటుగల్గుట, పాటలుపాడినప్పుడు, నిద్రించుట ఇవి భూతజ్వరలక్షణములు.

### 44 అజీర్ణజ్వరనిదానము.

జ్వరము, తెగిపడుదగ్గు, దీపనదాహిత్యము, పిక్కలుకాళ్లు నొప్పులుగల్గుట, పులితేన్పులు, పలువరింతలు ఇవిఅజీర్ణజ్వరలక్షణములు

### 45 అభిఘాతజ్వరనిదానము.

దూరమార్గగమనముచేతను, అలసిపనిచేసినను, వచ్చినచోఅభిఘాతజ్వరమనిపేరు. ఇందుకు లక్షణములు—దాహము, ఒడలునొప్పి చెమ్మటలు, అనృతములాడుట, చలువ, గగుర్పాటుచుట జ్వరముతీవ్రముగవచ్చుట ఇవి అభిఘాతజ్వర లక్షణములు.

### 46 ఆహికజ్వరనిదానము.

జ్వరము, చలి, దేహమునపుల్కలుగల్గుట, దాహము, విదాహము, తల, కడుపు, ప్రక్కలు కన్నులునొప్పిగానుండుట, అపథ్యములుచేయుట, అధికనిద్రగల్గుట, కాళ్లు, ఉదరము, ముఖము వాపు చూపుట, దేహము తెల్లబడుట, నేత్రములు పచ్చబడుట, రెప్పలు, గోళ్లు రక్తహీనమగుట, కడుపుపారుట, కాళ్లుచేతులు, వేసినట్లేయుండుట, అరకాళ్లు, అరచేతులుమంటలుగల్గుట ఇవిఆహికజ్వరలక్షణములు.

### 47 ఆహికజ్వరభేదములు.

1 ఏకాహికము 2 ద్వ్యాహికము 3 త్ర్యాహికము 4 చాతుర్థికము 5 పంచాహికము 6 అర్ధరాత్రిజ్వరము 7 పాక్షికము 8 మాసజ్వరము 9 వాతపైత్యశ్లేష్మకాలు.

### 48 జ్వరనిదానములు.

జ్వరములు 1 త్వగ్గతజ్వరమనియు 2 అస్తిగతజ్వరమనియు 3 రక్తగతజ్వరమనియు 4 మాంసగతజ్వరమనియు నాల్గువిధములు.

### 49 త్వగ్గతజ్వరనిదానము.

దాహము, నాడిమందముగా నడచుట, సన్నగాతలనొప్పికల్గుట ఇవి త్వగ్గతజ్వరనిదానములు

50 అస్థిగతజ్వర నిదానము.

అంతర్దాహము, శరీరముచల్లన, ఎగఊపిరి జ్వరకౌటిల్యము శరీరమున అంటియుండుట, శరీరము క్షీణదశకువచ్చుట, శరీరము తెల్లనగుట, ఇవి అస్థిగతజ్వరలక్షణములు,

51 రక్తగతజ్వర నిదానము.

తీవ్రజ్వరముగల్గుట, దాహము, చెమ్మట, అలపు మతిభ్రంశము దేహమంతయు నొప్పులు, మూర్ఛ, ఇవి రక్తజ్వరలక్షణములు.

52 మాంసగతజ్వర నిదానములు.

తీవ్రజ్వరముగల్గుట, దగ్గు, పెదవులారుట, దేహమంతయునొప్పి, తొందరపాటు, శరీరవిదాహము, గగుర్పాటు, మూర్ఛ ఇవిమాంసగతజ్వరలక్షణములు.

53 సన్నిపాతజ్వర నిదానము.

రొమ్ము, నుదురు, కుత్తుకమండుట, మతిభ్రంశము, శరీరము తలనొప్పులుగ నుండుట. అవయవములన్నియు విదాహించుట, కన్ను లెర్రగాగాని, పచ్చగాగాని యుండుట. మూర్ఛవచ్చుట, భ్రాంతిగల్గుట, కల్లలుపల్కుట, దగ్గుతెగిపడుట, కడుపుశూల, వెక్కిళ్ళువచ్చుట, గగుర్పాటు ఇవి సన్నిపాతజ్వర లక్షణములని తెలియవలెను.

54 13 సంధులపేర్లు.

1 సంధికం 2 అంతికం 3 హృద్దాహం 4 చిత్తవిభ్రమం 5 శీతాంగం 6 తాంద్రికం 7 కంఠకుబ్జం 8 కర్ణికం 9 భగ్ననేత్రం 10 రక్తేష్టి 11 ప్రలాపం 12 జిహ్వకం 13 అభిన్యాసం ఇవి 13 సంధులపేర్లు

55 సంధికనిదానము.

స్వరూపము మారదు, శూలలుగల్గును, శరీరము శోభించును. దాహముగల్గును. ఒడలు నొప్పిగానుండును, విదాహించును, దగ్గుగల్గును.

56 అంతకనిదానము.

దాహము, విభ్రమ, తాపము, శిరఃకంపనము, అనృతప్రలాపము, వాంతులు, ఎక్కిళ్ళు, జ్వరముగల్గును.

57 హృద్దాహనిదానము.

మృషాప్రలాపములు, అల్లరిచేయుట, స్వేదముగల్గుట, కుత్తుక నుదురు, చమర్చుట.

58 చిత్తవిభ్రమునిదానము.

తనువున నొప్పులుగల్గుట, వాతపైత్యములు ప్రకోపించుట, విభ్రమగల్గుట, కనుబొమ్మలు ముడివేయుట, ప్రేలాపన, పాటలు పాడుట, చెప్పినమాటలే మరలమరల చెప్పుట.

59 శీతాంగనిదానము.

కీళ్ళనొప్పులు, దేహము అతిపైత్యమున నుండుట, ఉబ్బసము, కడుపుపారుట, వెక్కిళ్లువచ్చుట, మూర్ఛగల్గుట, దేహము నాకుట.

60 తాంద్రికనిదానము.

అనృతాలాపములు, తొందరపాటు, జిహ్వనల్లబడి ముళ్లు కన్పడుట, తాపముగల్గుట, పాచనముగుట, ఉబ్బసముగల్గుట కన్నులనీరు గారుట, విరిచినపెక్కువైయుండుట, జ్వరమధికముగగల్గుట.

61 కంఠకుబ్జనిదానము.

విభ్రాంతి, దాహము, తలవిసురు, మెడకుదియబడుట, అనృతాలాపములు, మాటిమాటికిని లేచుట, మూర్ఛ, దేహము నొప్పిగల్గుట, తెగిపడుదగ్గు, వాంతి, ఎక్కిళ్ళు గల్గుట, శిరోబాధగల్గుట.

62 భగ్ననేత్రనిదానము.

కన్నులు మిక్కిలి తెరువబడుట నీరుగారుట, అనృతాలాపములు, విభ్రమకంపనము గల్గుట.

### 63 రక్తేష్టి నిదానము.

జిహ్వాపగులుట, పెదవులు పగులుట, నెత్తురు కారుట, జ్వరము అధికముగావచ్చుట, పెదవులెండుట, వణకుగల్గుట. మూర్ఛవచ్చుట, వెక్కిళ్ళువచ్చుట, అన్యతాలాపములాడుట, దగ్గుట, శిరఃకంపనము గల్గుట, కంపకము, నాల్క ముళ్ళుదేరి నల్లబడుట.

### 64 ప్రలాపక సంధికనిదానము.

దేహము కంపించుట, అన్యతప్రలాపములాడుట, దాహాధిక్యత గల్గియుండుట, ఒళ్ళునొప్పులు, వెక్కిళ్ళు, దగ్గు, మాటిమాటికిని లేచి పోవుట, జ్వరతీవ్రము.

### 65 జిహ్వాక సంధికనిదానము.

తీవ్రగతి ఊపిరివిడుచుట, దగ్గును, తాపమునుగల్గుట, నాల్క ముళ్లుదేరి నల్లబడుట, చెవుడువచ్చుట.

### 66 అభిన్యాప సంధికనిదానము.

వాతపైత్యశ్లేష్మాదులు, కలిసియుండును. ముఖమునిగనిగలాడును, అధికనిద్రగల్గును. ఒళ్ళునొప్పులుండును, దాహము, చెమ్మటగల్గును.

### 67 సాధ్యాసాధ్య సన్నిపాతముల నిదానము.

పై 13 సన్నిపాతములందును 6 సాధ్యములు. 7 అసాధ్యములు. 1 సంధికం 2 తాంద్రికం 3 ప్రలాపం 4 చిత్తవిభ్రమం 5 జిహ్వాకం 6 కర్ణికం ఈఆరున్ను సాధ్యములు.

1 హృద్దాహము 2 అంతకం 3 భగ్ననేత్రసంధి 4 కంఠకుబ్జము 5 శీతాంగము 6 అభిన్యాసము 7 రక్తేష్టి యీ ఏడును అసాధ్యములు.

### 68 సన్నిపాత కాలపరిమితి.

సంధికమునకు 7 దినములు, అంతకమునకు 10 దినములు, హృద్దాహమునకు 20 దినములు, చిత్తవిభ్రమమునకు 21 దినములు, శీతాంగమునకు 15 దినములు, తాంద్రికమునకు 25 దినములు, లేకున్న 7 దిన

ములు, కంఠకుబ్జమునకు 13 దినములు, కర్ణికమునకు 2 నెలలు, భగ్న నేత్రమునకు 30 దినములు, రక్తేష్టికి 10 దినములు, ప్రలాపమునకు 10 దినములు, జిహ్వాకమునకు 16 దినములు, అభిన్యాసనంధికి 15 దినములు.

69 సప్తవిధ దోషములకును నిదానము.

తరుణజ్వరాదులలో అపథ్యము చేయుటచేత సప్తవిధములగు దోషములు పుట్టును.

70 సన్నిపాత హేతువులు.

పులుసు, చేదు, కారము, వగరు, పరిమళద్రవ్యములు, శైత్యోపచారములు, స్త్రీసంగమము, కోపము, దూరమార్గగమనము, మొదలగు అపథ్యములచేత నవజ్వరములలో నేదేని దోషము జనించును.

71 జ్వరమునకు హేతువులు.

శ్రీగంధము, కర్పూరము, పూవులు, విడెము, పోకలు, ఎర్రకోకలు, నెయ్యి, బెల్లము, కస్తూరి మున్నగుపరిమళద్రవ్యములు భోజనము, దూదిపరుపు నూత్నవస్త్రములు, గాలిదూరుయిండ్లు, స్త్రీస్పర్శ, ఇవి జ్వరాధిక్య హేతువులు.

72 నాడి దొరకనివారు.

తొందపాటు, మూర్ఛ, భ్రమ, దప్పి, అన్మృత ప్రలాపములు, రొమ్మునొప్పిగానుండుట, ఇవి అసాధ్యములు.

73 విషమదోష నిదానము.

తరుణజ్వర మధ్యమున స్త్రీసంగమమువలన దోషముపుట్టినచో శరీరమునొచ్చుట, దేహముకంపించుట, రొమ్ముమంట, అన్మృతప్రలాపములు, లేచి లేచిపోవుట, కరపాదములు శీతలములగుట, కన్నీరుగారుట.

74 విషమదోష నిదానము.

జ్వరము, తాపము, నాడితీవ్రమై వక్రగతిగ నడచును. కడుపులో మంట, చెమ్మట, మూర్ఛగల్గినచో విషమదోషము.

## 75 విషమశీతనిదానము.

దినమునకు 2, 3, సార్లు చలి వణకుపుట్టుట, శిరస్సుబాధ, జిహ్వాకఠినమై, ముళ్ళుగల్గియుండుట.

## 76 పిత్తజిహ్వానిదానము.

జిహ్వ పచ్చబడి తడియారుట, నాల్క ముళ్లుగల్గియుండుట, జ్వరము, భ్రమ, మూర్ఛగల్గి దగ్గు తెగిపడును.

## 77 రక్తజిహ్వాకదోషము.

జిహ్వ ఎర్రబడి, ముండ్లుగల్గి తడిగానుండుట, జ్వరము, దాహముగల్గుట.

## 78 కర్ణికజిహ్వాకనిదానము.

జిహ్వ నల్లనై పిడుకవలె ముండ్లుగల్గియుండుట, లేచిపోవుట, భ్రమగల్గుట, ఉబ్బసము, స్వేదముగల్గుట.

## 79 పై 7 దోషములకు నిదానము.

15 దినములు 7 దినములు ఈ రెండును ఈదోషాలకు ప్రమాణము.

## 80 అతిసారనిదానము.

అతిసారము, గురు, తీక్ష్ణద్రవ్యములవల్లను, వేడివల్లను, క్షారమువల్లను, శీతలద్రవ్యములవల్లను, శాకములవల్లను. మాంసమువల్లను, ఉడుకునీళ్ళవల్లను, పచనదోషములవల్లను, అతిసారములు పుట్టును. దీనికి లక్షణము—మలముమరుగుగట్టిపడును. కడుపునను, బొడ్డుక్రిందను నొచ్చుట, కొంతగట్టిమలము వెళ్లును. ఇది అతిసారము.

## 81 వాతాతిసారనిదానము.

మలము ఎఱ్ఱగానుండును. నురుగులుగట్టి విడుచుట, అప్పుడప్పుడు కొంచెము జిగురుతో వెళ్లును.

### 82 పిత్తాతిసారనిదానము.

మలము ఎఱ్ఱిగాను పచ్చగాను ఉండును. నురుగుకట్టును. జిగురుపడును. దాహముగల్గును, కడుపుకుట్టును. దాహము తరుచుగా అగును. స్వేదముగల్గును, మూర్ఛగల్గి పెదవులెండును.

### 83 శ్లేష్మాతిసారనిదానము.

నురుగుతోకూడిన చిక్కని తెల్లనిమలముగల్గును. దగ్గువచ్చును. ఎగపోతగానుండును. సరిగారాకుండును. సన్నగాకటుపుకుట్టును.

### 84 జ్వరాతిసారనిదానము.

జ్వరమువచ్చుట, తాపముగల్గుట, కడుపులోనొప్పి, అరుచి, రోత, పారుట, బంకగాని రక్తముగానిపడుట.

### 85 దోషాతిసారనిదానము.

అంతర్దాహము, బహిశ్శీతము, చేతులుకాళ్లు చల్లగానుండుట, వృషాలాపములు, వాంతి, వెక్కిళ్లు, దగ్గు, పారుట, దేహకంపనము, ఉబ్బు, అలసట, నిద్రాభావముగాని, నిద్రగాని, నెత్తురు, బంకపడుట, కుట్టుగల్గుట, చెమ్మటఉండదు.

### 86 రక్తాతిసారనిదానము.

మలము ఆముదమువలెగాని, అతిరక్తముగాగాని, మాంసమువలెగాని, తేనవలెగాని, దుర్గంధమువలెగాని, వెళ్ళినచోఅసాధ్యము.

### 87 అసాధ్యాతిసారనిదానము.

మలము మిశ్రివర్ణముగాగాని, అతిరక్తముగాగాని, తేనెవలెగాని, కంపుగాగాని ఉన్నచో అసాధ్యాతిసారము.

---

# భస్మములు,

### 88 లోహభస్మము.

శుద్ధిమైన రావడినూరి నేరేడుచెక్కతో తీసిన రసమున 2 జాములువండవలెను. పిదప ఉసిరికపప్పరసమున, చింతాకురసమున, ములగ జిగురురసమున, ఆవుపంచితమునను, ఈ రసాల నొక్కొక్కసారి నూరి ఉడుకబెట్టవలెను. పిమ్మట వాని నన్నిటిని, కలియనూరి మూసలో పోసి గజపుటము పెట్టినచో భస్మమగును.

### 89 లోహసిందూరము.

శుద్ధిమైన లోహము కరక, తాడి, వుసిరికలరసముతో మర్దించి గజపుటముపెట్టి, పిదప మర్రిపాలతో మర్దించి, జిల్లేడుపాలతో 7 దినములు మర్దించి గజపుటంపెట్టవలెను. ఇట్లు 7 పుటములు పెట్టినపిదప, లోహసిందూరభస్మమగును.

### 90 నాగభస్మము.

ఒక పెంకులో సీసముబోసి, అశ్వసరపు ఆకురసముపోసినను, అడ్డసరపుకట్టెలను వేయించినను సీసము భస్మమగును.

### 91 నాగసిందూరము.

పై సీసభస్మము అడ్డసరపు ఆకురసమును, వాయురసమును, బూడలపాకురసమునను 10 మారులు వేయించి తమలపాకులరసాన 10 సార్లు వేయించి ఒక గజపుటము పెట్టితే సిందూరమగును.

### 92 వంగభస్మప్రకారము.

ఉత్తరేణికట్టెలను, తగరమును మంగలములో వేయించినచో తగరభస్మమగును. ఆభస్మమును, నిమ్మపండ్లపులుసున మర్దించి 3 గజపుటములు పెట్టినట్లయిన, సిందూరమగును.

### 93 ఇంకొకక్రియ.

శుద్ధిమైన తగరమును రేకులుగాచేసి, మోదుగచెక్కరసముతో అరదళం మెత్తగానూరి, తగరపురేకులకుపూసి, వజ్రమూసలో 1 పుటముపెట్టితే భస్మమగును. ఆభస్మం సీసమువలెవేయించినయెడల సిందూరమగును.

### 94 తామ్రభస్మము.

శుద్ధిమైన రాగిరేకులను, సరిగాగంధకం, జిల్లేడుపాలతోనూరి దానిని రాగితో సమముగానుంచుకొని, రాగిరేకులకుపూసి మూకుడులోనుంచి, చీరమన్నుతో,1 పుటము వేయగా భస్మమగును. ఆభస్మము ఆవుపాలను, ఆవునేతిని, కలబందరసానను, త్రిఫలకషాయమునను, మర్దించి మరి 4గజపుటములు పెట్టినచో, ఛర్ది దాహాలుమున్నగుతామ్రదోషములు నశించును. శుద్ధభస్మము చిక్కును.

### 95 స్వర్ణభస్మము.

శుద్ధిమైన బంగారపురేకులు వేసి, నిమ్మపండ్లపులుసు, హేమాక్షీకమున మర్దించి పలుచని ఆరేకులు మూకుడులోపెట్టి, మూతవేసి చీరమన్నుతో 1 గజపుటం.

### 96 సువర్ణసిందూరము.

పైవిధమున తయారయిన భస్మమును, జిల్లేడు పాలను రావిచెక్కరసముతోను మర్దించి, సువర్ణభస్మముతో సమమైన, మెత్తగానూరిన యింగిలీకమును, దూలదామర వేళ్ళరసమునను,హంసపాదాకురసమునను, 4 సార్లుమర్దించి పిడకలతో 5 గజపుటములు పెట్టినయెడల సువర్ణసిందూరమగును.

### 97 ఇంకొక విధము.

శుద్ధిమైవ సువర్ణమును రేకులుగాజేసి, చెరుకురసముతోసి,గంధకమునూరి, రేకులకు పట్టించి వాని నెండబెట్టి, ఇట్లు 7 సార్లు పూసి

యెండబెట్టవలెను. తరువాత ఆ రేకులు మూకుడులోనుంచి, రెండు కోకమన్నులుపూతపూసి, గజపుటంపెట్టిన వెనుక మర్దనా చేసి,అందు 4 వసాలు, గంధకముముపెట్టి వెనుకటివలెనే గంధకం చెరుకు రస మున నూరి పూసి, ఈచెప్పినతీరుగనే 3 గజపుటములు పెట్టిన, సువ ర్ణభస్మమగును. అది క్షయరోగముల కిచ్చేది.

98 రజితభస్మము.

శుద్ధిచేసిన వెండి రేకులుగా చేసి, కాకమాక్షికంనూరి, మెత్తగా నూరిన కాకమాక్షికం. వెండిరేకులకు ఆరగా ఆరగా పూసి, ఆ రేకు లు వజ్రిపుమూసలో పోసి, ఏరుపిడకలను 1 గజపుటం పెట్టినచో రజి తభస్మమగును. ఇదికాక స్వర్ణభస్మమువలె చేసిననురజితభస్మమగును.

99 రజితసిందూరము.

పైనతయారుచేసిన రజితభస్మమునకు సమమగు ఇంగిలీకము పెట్టి తుమ్మచెక్కకషాయమున మర్దించి పిదప జిల్లేడుపాలను మర్దించి తరు వాత, మర్రిపాలనుమర్దించి పిదప దూలతామర వేళ్ళరసమున మర్దించి పిదప పానకపునీళ్ళను మర్దించి ఒక్కొక్కమారుకొలిమినిగాని, గజపు టములుగాని గజపుటములుపెట్టవలెను. ఇట్లు 7పుటములుపెట్టగా రజిత సిందూరమగును. అది అఖిల క్షయరోగములకు నివారకము.

100 కంచుభస్మము.

శుద్ధిమైన కంచును రేకులుచేయించి, కత్తిరించి, 6 మాన్లుజిల్లే డుపాల నెండించి, వజ్రపుమూసయందిడి, 7పుటములు యేరుపిడకలతో నుంచి పుటము పెట్టవలెను.

101కంచుసిందూరము.

పైవిధముగా తయారైన భస్మములో సగభాగము ఇంగిలీక ముపెట్టవలెను. ఇంగిలీకమున సగముగంధకముపెట్టవలెను. గంధకము సగము శుద్ధిచేసిన రసముపెట్టవలెను. మర్రిపాలతో మర్దించవలెను.

తరువాత హంసపాది ఆకురసముతో మర్దించవలెను. పిదప రావిచెక్క కషాయమున మర్దించవలెను. తరువాత మోదుగ చెక్కరసముతోను దూలదామర వేళ్లరసముతోను నిమ్మపండ్లపులుసుతోను క్రమముగా మర్దించవలెను. పిదప మూసలోనుంచి 7 గజపుటములు పెట్టినచో కంచుసిందూరమగును.

102 కాంతభస్మము.

శుద్ధియైనకాంతమునకు 4వ పాలు గంధకం వేసి, జిల్లేడుపాలతో మర్దనచేయవలెను. తరువాత కొమ్ముసపిండి పసరుతో మర్దనచేసి, పిదప మోదుగ చెక్కరసముతో మర్దించి, ఒక్కొక్క మర్దనాకుఒక్కొక్క పుటముచొప్పున 3 గజపుటములు పెట్టినచో కాంతభస్మమగును.

103 కాంతసిందూరము.

పై భస్మములో సగం ఇంగిలీకంపెట్టి, దూలదామర వేళ్ళరసము నమర్దనాచేసి, ఎర్రమన్నుతో మూసచేసి, అందులో మర్దనాచేసిన కాంతంపెట్టి పిదప కోకమన్ను వేసి, 3 గజపుటములు పెట్టవలెను.

104 ప్రవాళభస్మము.

శుద్ధియైన పగడములు, జిల్లేడుపాలలో 3 రోజులు భావనచేసి 1 గజపుట మిడవలయును.

105 మౌక్తికభస్మము.

శుద్ధియైన ముత్యములు తెల్లములగపండ్లరసమున భావనచేసి మూకుడులోపెట్టి కోకమన్నులిచ్చి 1 పుటంపెట్టగా శుద్ధభస్మమగును.

106 వజ్రభస్మము.

శుద్ధియైన వజ్రములు నల్లేరురసమున 1 దినము నానవేసి, వజ్రపు మూసలోనుంచి కోకమన్ను వేసి పిడకలతో 1 పుట మియ్యవలెను.

### 107 మరకత భస్మము.

నేలగుమ్మిడి దుంపలో మరకతము ఉంచి, కోకమన్నులిచ్చి కుక్కుట పుటముపెట్టి సాంగశీతలాన ఉంచవలెను.

### 108 నీలభస్మము.

శుద్ధమైన నీలములు లక్ష్మివంజి ఆకురసమున 8 ఝామలు నానవిచ్చి వజ్రపుమూసలో ఉంచి కొలిములో ఊదవలెను.

### 109 రత్నభస్మము.

శుద్ధమైన రత్నములు జిల్లేడుపాలలో 3 రోజులు భావనచేసి, మూకుటబోసి 3 చీరమన్నులిచ్చి ఏరుపిడకలతో పుటముపెట్టవలెను.

### 110 పుష్యరాగభస్మము.

శుద్ధమైన పుష్యరాగములు కొమ్మునపిండి, ఆకురసమున నాననిచ్చి, మూకుటబోసి, పెరొకమూకుడుమూసి, కోకమన్నులిచ్చి, కొలిమిని ఊదినచో భస్మమగును.

### 111 గోమేధిక భస్మము.

శుద్ధమైన గోమేధికములు నల్లఉమ్మెత్తాకు రసములోనాననిచ్చి కొలిమిని ఊదవలెను.

### 112 వైడూర్యభస్మం.

శుద్ధమైన వైడూర్యములు కొమ్మునపిండి ఆకురసమున మర్దించి కొలిమినికాల్చి, వజ్రపుమూసను వేసి, మంచి అగ్నిలో 1 గజపుట మిడవలయును.

---

# అభ్రకములు.

## 113 అభ్రిక సాధనము.

అభ్రికము పార్వతీదేవి వీర్యము వలన జనించినది. ఇది 4 విధములు.

1. మండూకాభ్రికం. 2. వజ్రాభ్రికం. 3. నాగాభ్రికం. 4 పినాకాభ్రికం.

## 114. అభ్రికముల భేదాలు.

మండూకాభ్రికం అగ్నిపైవేసిన ఎగసి ఎగసి కూలును, వజ్రాభ్రికము అగ్నిపైవేసిన పొగసిపోవును. నాగాభ్రకం అగ్నిపైవేసిన పామువలె నగును. పినాకాభ్రకము అగ్నిపైవేసిన ఎఱ్ఱనైకాలును.

## 115 అభ్రకగుణవివరము.

1. మండూకాభ్రకము—రోగకారి.
2. వజ్రాభ్రకము—సర్వరోగహరము.
3. నాగాభ్రకము—శ్లేష్మకారి.
4. పినాకాభ్రకము—వాతకారి.

## 116 అభ్రకముల 4 వర్ణములకు గుణములు.

1. రక్తాభ్రకము—వాతకారి.
2. శ్వేతాభ్రకము—ఉష్ణకారి.
3. పీతాభ్రకము—శ్లేష్మకారి.
4. కృష్ణాభ్రక—సర్వరోగహారి.

## 117 అభ్రకనవనీతము.

కలిలో 3 దినములుదాక కృష్ణాభ్రకమును నాననిచ్చి ఎండబెట్టి రోట దంచి, చూర్ణముచేసి దానిని తిరిగి కలిలో నాననిచ్చి, మూతి

వెడల్పుగల క్రొత్తబానతెచ్చి, క్రొత్తకోకతో వాసినగట్టి, దానిమీద వానబోసిన అభ్రకము పెట్టి దానికి సగముదాక కలిపోసి మర్దించిన క్రిందికిదిగి అభ్రకనవనీతమగును.

### 118 అభ్రకసిందూరము.

అభ్రికనవనీతము ఆవునేతియందును, ఉలవకట్టులోను, జిల్లేడు పాలలోను, మట్టిపాలలోను, మర్దనాంచేసి, ఒక్కొక్కటే 3 పుటాలు పెట్టిన తరువాత తులసి, దుష్టుపు, గానుగు, ముల్లుగోరంటు, జిల్లేడు ముల్లుమోదుగు చెక్క, రావిచెక్క, పొన్నగంటి, గజ్జేరి, పిల్లిపెసర, నేల తాడిదుంప, ఉత్తరేణి, మర్రిపాలు, పిన్నసర్పాక్షి, వాకుడు, నల్లకలువ దుంప వావిలిఆకు, బోడసరం, అడ్డసరం, పెన్నేరుదుంపలు, కలబంద కలివెందాకు, నేలగుమ్మడి, తెల్లవుప్పి, మారేడుగింజలతైలము, మును గువేరుచెక్క, తొగరుదుంపరసం, వీనిని మర్దించుచు ఒక్కొక్కరసము నకు ఒక్కొక్కటిగా, 32 పుటములుపెట్టి, మర్రిఊడల రసము, అల్లపు రసము, నిమ్మపండ్లరసము, తుంగముస్తెలరసము, పసుపు, ఉస్తికూర రసము నూరిఉంచి దానితో 10 గజపుటములు పెట్టవలెను.

### 119 అభ్రకసాధనం.

శుద్ధియైన అభ్రకం జిల్లేడాకురసములో మర్దించి వజ్రపు మూస లో ఊది, జిల్లేడాకు రసముతో నూరి తిరిగి ఊదవలెను.

## శుద్ధులు.

---

120 తామ్రశుద్ధి:—రాగిని సన్నరేకులుగా కత్తిరించి ఎర్రగా కాలనిచ్చి ఉలవకట్టులో చల్లార్చి కలబందరసములో సూరల చేయవ లెను. పిదప ఇంకొక నారికాచి చింతాకురసమున చల్లార్చి పులిచల్లలో

చల్లార్చవలెను. పిదపపొన్నగంటిఆకురసమునచల్లార్చవలెను. ఒక్కొక్క దానిలో 7 సార్లు తాడింపగా తామ్రము శుద్ధియగును.

121 సువర్ణశుద్ధి:—సువర్ణమును ఎఱ్ఱమంటిలో పొదిగి కాల్చిన శుద్ధియగును.

122 రజితశుద్ధి:—రేకులుగా చేయబడిన వెండిని గోంగూరాకు రసమున 7 సార్లు కాల్చి చల్లారనీయవలెను.

123 కంచుశుద్ధి:-చింతాకు పసరులో కంచును 3 సార్లు దాలన చేసి ఉలవకట్టులో చల్లార్చవలెను.

124 కాంతశుద్ధి:—కాంతం నిమ్మపండ్లపులుసులోను, కలి, పులి చల్లలోను ఒక్కొక్కమారు నాననిచ్చి రెండేసి గడియలు ఎండబెట్ట వలెను.

125 విద్రుమశుద్ధి:—పగడములు నిమ్మపండ్లపులుసులో 1 దిన ము భావనచేయవలెను.

126 మౌక్తికశుద్ధి:—ముత్యములు తెల్ల వుప్పిపండ్ల రసమున నైనను, కుంకుడుపండ్లరసముననైనను, చింతపండు పులుసుననైనను 2 రోజులు నానబెట్టవలెను.

127 వజ్రశుద్ధి:—వజ్రములను అశ్వమూత్రమున 3 దినములు ఎండించవలెను.

128 మరకతశుద్ధి:—మరకతమును నేలగుమ్మడిదుంపలోనుంచి కోకమన్నులిచ్చి కుక్కుటపుటముపెట్టి సాంగశీతలాన నుంచవలెను.

129 నీలశుద్ధి:—నీలములు గాడిదిగంతలోపోసి పూర్తిగా 1 దినము భావనచేయవలెను.

130 మాణిక్యశుద్ధి:—మాణిక్యములను అశ్వమూత్రమున 3దినములు ఎండబెట్టవలెను.

131 పుష్యరాగశుద్ధి:—పుష్యరాగములను మేకవుచ్చలో 1జాముసానసీయవలెను.

132 గోమేధికశుద్ధి:—గోమేధికములను అశ్వమూత్రమున 3 రోజులు నాననిచ్చి పిదప నేలగుమ్మడిదుంప రసమున నాననీయవలెను.

133 వైడూర్యశుద్ధి:—వైడూర్యములను 1 దినం అశ్వమూత్రమున నాననిచ్చి గుమ్మడికాయరసమున నానసీయవలెను.

134 అభ్రికశుద్ధి:—కృష్ణాభ్రికమును ఎర్రగా 7 నాళ్లు దాకలో వేయించి మూత్రమున చల్లార్చుచుండవలెను.

135 మణిశిలశుద్ధి:—మణిశిలను సన్నని కోకలో మూటకట్టి, మేకపంచితమున 3 నాళ్లు డోలాయంత్రమున వండవలెను.

13[illegible] హరిదళశుద్ధి:—సన్నగా కత్తిరించబడిన హరితళమును [illegible], గోమూత్రమునసైనను, కలిలోనైనను, 3 రోజులు సన్నమంటవేసి డోలాయంత్రమున వండవలెను.

137 కఫరిశుద్ధి:—పొడిగా చేసిన కఫరిని, గుడ్డను ముడివేసి నరమూత్రమున 7 జాములు ఉడికించిగాని, గోమూత్రమున 2 జాములు వండినగాని శుద్ధియగును.

—: ఇంకొక ప్రక్రియ :—

నెయ్యి గరిటెలో పోసి 7 పొంగులు పొంగి చవలెను.

138 విమళనశుద్ధి:—విమళనమును పగులగొట్టి సన్నబట్టను మూటగట్టి, గొఱ్ఱెపంచితము, కలి, అరటిపండు వీటిలో[illegible]కట్టి 4 జాములు డోలాయంత్రమున ఉడికించవలెను.

139 మాక్షికశుద్ధి:—మాక్షికమును పేనెతో పిష్టముగునట్లు మర్దించి జములుగుడ్డనుమూటగట్టి, ఒకనాడు కలపక్షమునను, ఒకనాడు ఆవుపంచితమునను, ఒకనాడు, కలితో 3 రోజులు, డోలాయంత్రమున వండవలెను.

140 ఉల్లిపాషాణము శుద్ధి:—ఉల్లిపాషాణము చూర్ణముగా చేసి, గుడ్డలోకట్టి, సున్నపునీళ్లతో 1 దినం డోలాయంత్రమున వండవలెను.

141 గౌరీపాషాణము శుద్ధి:—గౌరీపాషాణమును నిమ్మరసమున నూరి, ముద్దగాజేసి, జములుగుడ్డలోగట్టి, సున్నపునీళ్ళతో డోలాయంత్రమున 2 జాములు వండవలెను.

142 ఇంగిలీకముశుద్ధి:—ఇంగిలీకమును చనుబాలతోగాని, నిమ్మపండ్లరసమునగాని మర్దించవలెను.

143 వెలిగారముశుద్ధి:—నిప్పులమీద వెలిగారం పొంగించిన శుద్ధియగును. అట్లుకానిచో కలిపోసిదైన నూరవచ్చును. లేదా నిమ్మపండ్లరసమున మర్దించవచ్చును.

144 మైలతుత్తంశుద్ధి:—మైలతుత్తములో పెరుగుపోసి నూరి పెంకులో వెచ్చచేయవలెను.

145 పాలతుత్తంశుద్ధి:—పాలతుత్తం పొడిచేసి, మూటగట్టి, సున్నపునీళ్లతో డోలాయంత్రమున వండవలెను.

146 గంధకం శుద్ధి:—గంధకం ఆముదముపోసి, ఇనుపచిప్పలో ఉడికించినగాని, మేకపాలతో ఉడికించినగాని శుద్ధియగును.

147 నాభిశుద్ధి:—కత్తిరించిననాభిని, గోమూత్రమున గాని, మేకమూత్రమునగాని, 3 రోజులు భావనచేసి ఎండబెట్టవలెను.

148 నేపాళముశుద్ధి:—పైనపొట్టుతీసివేసి ఆవుపేడను 1జాము వుడికించి, వానినితీసి, లోపల ఉన్నఆకులను ఒలిచివేసి నేతిలో వేయించి పిదప ఆవుపాలలో ఉడికించినశుద్ధియగును.

149 అమిదెలశుద్ధి:—అమిదెలు కొబ్బరి కాయనీళ్లలో పోసి. ఒకజాము వండవలెను. ఇదినేపాళము వలెకూడ శుద్ధియగును.

150. వ్రుల్లిపాషాణముశుద్ధి—తేనెతో 1 జాము ఉడికించవలెను

151. గుగ్గిలము శుద్ధి—గుగ్గిలము గుడ్డనుకట్టి, త్రిఫలకషాయమున కాచి, 2 జాములు డోలాయంత్రమున ఉడికించవలెను.

152. సైంధవలవణశుద్ధి—కలితో భావన చేసినను, మేకపంచితమున ఇగురునట్లుడికించినను సైంధవలవణము శుద్ధియగును.

153. సవర్చలవణశుద్ధి—ఆవుపంచితమున నాన్చి ఉడికించవలెను.

154. బిడాలవణశుద్ధి—చల్లతో తడిపి, ఎండించినగాని, గోమూత్రమున తడిపి ఎండించినగాని శుద్ధియగును.

155. సద్యక్షారశుద్ధి—సద్యక్షారము కలిపోసి 3 గడియలు మర్దనాచేసినగాని, మేకపంచితమున 3 గడియలు మర్దనా చేసినగాని శుద్ధియగును.

156. యవక్షారశుద్ధి—పసిగడుగున మర్దించి 1 గడియఎండించవలెను.

157. కాచలవణశుద్ధి—చింతాకు రసమున తడిపి ఎండబెట్టవలెను.

158. శిలాజిత్తుశుద్ధి—శిలాజిత్తు కలువదుంప రసముపోసి 1 జాము మర్దించి ఎండబెట్టవలెను.

159. కర్పూరశిలాజిత్తుశుద్ధి—తామర తూండ్లరసమున గాని, కలబంద రసమునగాని, 1 జామునేపు మర్దనాచేయవలెను.

160. బోళకశుద్ధి—నల్లబోళంగాని, తెల్లబోళంగాని, 1 జాము కలితో మర్దనాచేసి ఎండబెట్టవలెను.

161. ఇంగువశుద్ధి—తామరాకురసమున, 1 జాముమర్దించి ఎండ బెట్టవలెను.

162 మనశ్శిలశుద్ధి—నిమ్మపండ్ల పులుసునగాని, మూనవపంచిత మునగాని, 1 జాము మర్దించవలెను.

163 గజపిప్పళ్ళశుద్ధి—కలితోగాని, గోరోజనముతోగాని, 1 జాము భావనచేయవలెను.

164 ఉమ్మెత్త గింజలశుద్ధి—నిమ్మపండ్ల రసమున 1 జామునా నవేయవలెను.

165 ముషిణి గింజలుశుద్ధి—చిత్రివేళ్ల రసమున 1 జాము ఉడికించవలెను.

166 శొంఠిశుద్ధి—శొంఠిమీద చెక్కుతీసి, రాతిసున్నముపూసి ఎండబెట్టవలెను.

167 పిప్పలిశుద్ధి—చిత్రమూలపు వేళ్లరసమున 1 జామునాననిచ్చి ఎండబెట్టవలెను.

168 మిరియాలశుద్ధి—పులిచల్లలోనాన్చి పెంకులోవృడికించవలెను. లేదా 1 జాముపులిచల్లలో నానబెట్టవలెను.

169 వాము యుశుద్ధి—సున్నపునీళ్ళలో 1 జాము నాన్చవలెను.

170 జీలకర్రశుద్ధి—నల్లజీలకర్రగాని, తెల్లజీలకర్రగాని, 2 జాములు ఎండబెట్టి, కొంచెము వేడిచేయవలెను.

171 లోహశుద్ధి—పొడిగా రాచి,అరపడినూనెలో ఉడికించిపిదప నీళ్ళలో కడిగి, తుమ్మచెక్కరసాన వండి 1 జాము ఎండబెట్టవలెను.

172 నాగవంగశుద్ధి—నూనెలో 7 సార్లు, ఆవుపంచితమున 7 సార్లు, కలిలో 7 సార్లు, ఉలవకట్టులో 7 సార్లు, జిల్లేడుపాలలో 7 సార్లు, మేకపాలలో 7 సార్లు, కరిగిపోయవలెను.

173 రససిందూరము చేయువిధము

శుద్ధిచేసిన రసం 1 పాలు, గంధకం 1 పాలు, ఈ రెంటికిన్ని 4వ పాలు నవాసాగరం వేసి చూర్ణముగా మర్దించవలెను. ఆ చూర్ణము గాజు

కుప్పెలో పెట్టి, రాతిబలపపు దిమ్మ చేసి గాని, ఇసుక సూరి దిమ్మగా చేసిగాని కుప్పికి పెట్టవలెను. దానిమీద చీరమన్ను యియ్యవలెను. క్రొత్తకడవ తెచ్చి అడుగున వెండిటంకమంత రంధ్రము చేయవలెను, రంధ్ర సమీపమున కొప్పిపెట్టి, ఆకుప్పిమూసి, దానిచుట్టూ ఒకమానెడు ఉప్పుపోసి, దానిపైనిండా ఇసుకపోసి, కడవకు వాసినవేసి కోకమన్ను లిచ్చి తామరపువ్వంత మంటవేసి 12 జాములు వండవలెను. గాలిలేని చోట పొయ్యిపెట్టవలెను.

### 174 ఇంకొక ప్రక్రియ.

రసగంధకములను శుద్ధిచేసి, సమభాగములుకూర్చి, హంస పాది ఆకురసమున 8జాములుమర్దించి మాత్రలుగాచేసి ఎండనిచ్చిగాజు కుప్పెలోపోసి అందుకుకోకమన్నుఇచ్చి, ఒకక్రొత్త కడవకు క్రిందుగా వెండిటంకమంత రంధ్రిముచేసి, కుప్పిపెట్టి, కుప్పిచుట్టును ఉప్పుపోసి, దానిపైనఇసుకపోసి, కడవమూతిమూసి, కోకమన్నుయిచ్చి, 12జాములు తామరపువ్వ ప్రమాణపు మంటతో పొగలేకుండ వండవలెను. సాంగశీతలమువనుంచి ఔషధమునకు 6వ పాలు శుద్ధిచేసిన వసనాభిపెట్టి, నాభికి సమమైన ఎత్తు మిరియాలుపెట్టి, చూర్ణముచేసి, అనుపానముతో గురివెందగింజ ఎత్తువాడవలెను.

### 175 దశవిధాగ్నికుమారముల పేర్లు.

1 రసభూపతిరాజాగ్నికుమారము 2, నవలోహాగ్ని కుమారము 3 రత్నాగ్నికుమారము 4 సిద్ధాగ్ని కుమారము 5 లఘ్వగ్నికుమారము 6. మహదగ్నికుమారము, 7. ప్రతాపాగ్నికుమారము, 8. త్రాణాగ్ని కుమారము, 9. దివ్యాగ్నికుమారము, 10. ఉత్తమాగ్ని కుమారము.

## 176 రసభూపతి రాజాగ్ని కుమారరసము.

శుద్ధిచేసినరసము, గంధకము, నాభి, ఉక్కురాపొడి, రాగి రేకులు, నలిగాచేసి, సమాంశాలు కూర్చి, హంసపాదాకురసంతో 3 రోజులు మర్దనాచేసి, దానిని గాజుకుప్పెలోపెట్టి, కుప్పెకు చీరమన్నులిచ్చి, కుండలోనుంచి క్రింద మీాద ఇసుక పోసి, మధ్య కుప్పెవుంచి, సన్నమంట వేసి, 12 జాములు వండి,సాంగశీతలంగాదించి అల్లపురసంతో మర్దించి కణికగట్టి అల్లపురసముతో మినపగింజంత ఇవ్వవలెను. సన్నిపాత జ్వరములు నివారించును.

## 177 నవలోహాగ్ని కుమారరసము.

శుద్ధిచేసిన పాదరసం, బంగారం, వెండి, తగరము, సీసము, రాగి, కంచు, ఇత్తడి, సత్తు, వీని భస్మములు సరిగా తూచి, జిల్లేడు వేళ్ళ కషాయముతో 5 రోజులు మర్దించవలెను. తరువాత గాజుకుప్పెలో ఉంచి, కుప్పెకు చీరమన్నులిచ్చి, వాలుకాయంత్రమున సన్నమంటమీాద 12 జాములు వంటచేసి సాంగశీతలముగాదించి చూర్ణముగా నూరి, గురివెందగింజంత అనుపాన విశేషములతో పుచ్చుకోవలెను.

## 178 రత్నాగ్నికుమారరసము.

శుద్ధిచేసిన పాదరసం, సముద్రపునురుప్పు, కాచలవణము, బిడాలవణము, సైంధవలవణము, నవరత్న భస్మములు, సమభాగములు చేసి, వులిమిరి చెక్కరసమునమన్ను, చిత్రమూలపు వేళ్లరసమునను 2 రోజులు మర్దనాచేసి, గాజుకుప్పెలోఉంచి, కోకమన్ను యిచ్చి వాలుకాయంత్రమున 6 జాములువండి, సాంగశీతలమున వుంచి, అనుపానములతో ఇవ్వవలెను. ఇది సర్వరోగహారి.

### 179 సిద్ధాగ్ని కుమారరసము.

శుద్ధిచేసిన పాదరసమును, అమరశిలగంధకమును, వెలిగారమును, సమభాగములుకూర్చి జిల్లేడాకు పసరున మర్దనాచేసి, చిన్న వుండలుగాచేసి, వజ్రపుమూసలో పోసి 7 చీరమన్నులిచ్చి ఆమూసను చిన్న చట్టిలోఉంచి, క్రిందను ఇసుకపోసి, మూకుడుమూసి, కోకమన్నిచ్చి నేలలోగుంటచేసి పిడకలతోనింపి, అచట్టిని అందులోవుంచి, గజపుటము వేయవలెను.

### 180 లఘ్వగ్నికుమారరసము.

శుద్ధిచేసిన పాదరసమును, వెలిగారమును, అమరశిలగంధకమును, హారిదళమును, మణిశిలను సమభాగాలుచేసి హంసపాదిఆకు రసమునమర్దించి గాజుకుప్పెలోఉంచి కోకమన్నులిచ్చి వాలుకాయంత్రమున 6 జాములు వంటచేసి, సాంగశీతలానదించి, అనుపానములతో గురివిందగింజ ఎత్తుమాత్రము ఇవ్వవలెను.

### 181 మహాదగ్ని కుమారరసము.

శుద్ధిచేసిన పాదరసము, వసనాభి, అభ్రకము, గంధకము, తాళకము, ఇంగిలీకము, వుల్లిపాషాణము, తామ్రభస్మము వీనిని, సమముగ గుంటగలిజఆకు రసమునమర్దించి గాజుకుప్పెలోనుంచి, చీరమన్నులిచ్చి వాలుకా యంత్రమున సన్నమంటను, 1 దినమువండి సాంగశీతలముగాదింపి, శెనగ గింజలంత అనుపానముతో సేవించవలెను.

### 183 ప్రతాపాగ్ని కుమారరసము.

శుద్ధిచేసిన పాదరసము, తామ్రభస్మము, వసనాభి, మిరియాలు శొంఠి, సద్యక్షారము, సముద్రపు ఉప్పు, సవర్చలవణము, సైంధవలవణము, బిడాలవణము, కాచలవణము, వీనిని, సమభాగములు కూర్చి అల్లపురసమున మర్దనాచేసి, గాజుకుప్పెలోనుంచి, చీరమన్ను

లిచ్చి, వాలుకాయంత్రమున సన్నమంటమీద 1 రోజువండి, 10 పాళ్ళు శుద్ధి చేసిన వసనాభిఉంచినూరి, గురివిందగింజంత, అనుపానముల తో పుచ్చుకొన్నచో ఇదిసర్వరోగ హారి.

### 183 దివ్యాగ్నికుమారరసము

నాభి, రసము, అభ్రకము, గంధకము, వీనినిసమభాగములు గాకూర్చి, పర్పాటకమున 3 జాములు మర్దనాచేసి మాత్రలుకట్టి వజ్రపుమూసలోవేసి 1 భూపుటంపెట్టి, సాంగశీతలానతీసి, కల్వములో ఉంచి చేపచేదున్ను, నెమలిచేదున్ను, పెట్టి మర్దించి అనుపాన విశేషాలతో పుచ్చుకొన్నచో సర్వరోగహారి.

### 184 ఉత్తమాగ్ని కుమారరసము.

శుద్ధిచేసిన పాదరసము, అభ్రకభస్మము, కాంతభస్మము, లోహభస్మము, తామ్రభస్మము, వసనాభి, ఇవి సమానముగా హంసపాది ఆకురసమున మర్దనాచేసి, మాత్రలుకట్టి ఆరినపిదప గాజుకుప్పెలో ఉంచి, చీరమన్నులిచ్చి వాలుకాయంత్రమున 4 జాములు వండి, చల్లారనిచ్చి, మర్దనాచేసి, మినపగింజలంత అనుపానములతో 13 సన్నిపాతములకు ఈయవచ్చును, ఇచ్ఛాపథ్యము, దాహమునకు కొబ్బరినీళ్లు, చెరుకు, బెల్లపుపానకము, ఇయ్యవలెను.

### 185 భూతేశ్వరరసము.

శుద్ధిచేసిన పాదరసము, వసనాభి, గంధకము, నేపాళాలు, ఇంగిలీకం, సమాంశాలుకూర్చి, చిత్రమూలపు వేళ్ళకషాయమున మర్దించి 1 దినము డోలాయంత్రమున పక్వముచేసి, చేపచేదుకట్టున 1 ఝాము మర్దనాచేసి, పిదప బ్రహ్మజెముడుపాలలో మర్దించి కరాటూనపెట్టి, అల్లపురసమున మినపగింజంత పుచ్చుకొన్నచో జ్వరహారము. జిల్లేడువేళ్ళకషాయము అనుపానముచేసి యిచ్చినచో సన్నిపాతములు హరించును. దాహమునకు ఆవుమజ్జిగ. పథ్యం, పెరుగువంటకం.

## 186 త్రిపురాంతకరసము.

రసం, గంధకం, అభ్రకం, ఈమూడున్ను సమభాగములుగా చేసి కల్వములో గుంటగలగరాకుతో మర్దనాచేసి, మాత్రిలుచేసి, ఆరబెట్టి, వజ్రపు మూసలోపోసి, కుక్కుటపుటముబెట్టి, స్వాంగశీతలానతీసి ఆతరువాత చేపచేదుకట్లతోను, మేకచేదుకట్లతోను, అడవిపంపిచేదుకట్లతోను, ప్రతిచేదున జాములు మర్దనాజేసిన సకల జ్వరములు నశించును. పథ్యం, చల్లవంటకం, దాహము పంచదార పానకము.

## 187 కాలకంధరరసము

రసగంధకాలు, వెలిగారం, పిప్పళ్లు, ఉమ్మెత్తవిత్తులు, మణిశిల వసనాభి, సమాంశములుగాకూర్చి హంసపాది ఆకుతో మర్దించి, మూకుడుఉంచి, పైన వేరొక మూకుడు మూసి, చీరమన్నులిచ్చి 100 పిడకలతో పుటముపెట్టి, స్వాంగశీతలాన గ్రుచ్చి, బ్రహ్మజెముడుపాలతో, 1 జాము మర్దించి, గురిజప్రమాణము అనుపానములతో పుచ్చుకొన్నచో సన్నిపాతములు శాంతించును. ఇచ్ఛాపథ్యం.

## 188 శాంభవీరసము.

శుద్ధిమైన పాదరసము, గంధకము, వెలిగారము, కరక్కాయలు, ఆముదపువిత్తులు, నేపాళములు, నాభిపాషాణము, సమానభాగములుగా కల్వములోనుంచి, నిమ్మరసమున 3 రోజులు మర్దనాచేసి మూకుట్లోపోసి, మీద యింకొక మూకుడు మూతమూసి కోకమన్నులిచ్చి ఒక్క కుక్కుటపుటమిచ్చి, స్వాంగశీతలాన గ్రుచ్చి, ఆముదముపోసి మర్దనాచేసి, 10 వ వంతు మిరియాలువేసి, మిరియాలలో సగం నాభివేసి కలయనూరి గుంజాప్రమాణం అనుపానములతో పుచ్చుకోవలెను. ఇది దోషజ్వరహారి. పథ్యం, పెరుగు వంటకం, దాహం కొబ్బరినీళ్లు.

189 భద్రకాళీరసం.

శుద్ధిచేసిన పాదరసము, వసనాభి, అభ్రకము, శొంఠి, పిప్పళ్లు, మిరియాలు, గంధకం, వెలిగారం. ఉమ్మెత్తగింజలు, సైంధవలవణం, సమానముగానూరి, వజ్రపుమూసలోపోసి వాలుకాయంత్రమున రెండు జాములు వంటజేసి, సాంగశీతలానగుచ్చి చేపచేదుకట్టున నూరి, మినపగింజంత అనుపానములతో ఇచ్చినచో దోషజ్వరములు మారించును.

190 భువనేశ్వరీరసము.

గౌరీపాషాణము, వసనాభి, పాదరసము, నేపాళములు, మణిశిలసమానముగా కాకరాకు రసమున కలయనూరి, కుక్కుటపుటానవండి, సాంగశీతలానగుచ్చి, 2 జాములు మర్దనాచేసి, చూర్ణమైనపిదప కరాటానపెట్టుకునేది, అదిగుంజా ప్రమాణం అల్లపురసమునైనను, త్రికటుకరసమునైనను పుచ్చుకొన్నచో సన్నిపాతములు శాంతియగును.

191 ఉమామహేశ్వరరసము.

శుద్ధియైన పాదరసం, అభ్రకము సమానముగా, వెలమసంధికషాయమున ఒక్కరోజు మర్దించవలెను. దానిని డోలాయంత్రమున 2 జాములువండి తరువాత 1 జాము నెమలిపిత్తాన మర్దనాచేసేది, కోడిపిత్తానకూడ 1 జాము మర్దించి మినపగింజంత అల్లపురసమున ఇచ్చినచో జ్వరములు మానును.

192 నారసింహ రసము.

రసగంధక నేపాళాలు, వసనాభి సమానములుగా 3 జాములు జిల్లేడువేళ్ళ కషాయమున మర్దించి డోలాయంత్రమున 1 జాము వండి గుంజాప్రమాణము అనుపానములతో ఇచ్చిన జ్వరహారి.

193 విశ్వంభరరసము.

శుద్ధిచేసిన పాదరసము, ఇంగిలీకం, అభ్రకం, వసనాభి, హారిదళంసమానముగా హంసపాదాకు కషాయమున2రోజులుమర్దనాచేసి,

కుక్కుటపుటంపెట్టి తరువాత తాబేలు, అడవిపంది చేదులందును, చేపపిత్తమునందును 3 రోజులు మర్దనాచేసి అనుపానములతో మినపగింజంతఇచ్చిన, దోషజ్వరసన్నిపాతములు నివారణమగును,ఇచ్ఛాపథ్యం చెరుకులు నారికేళజలం పానకం దాహామునకు.

### 194 గరుడధ్వజరసము.

రసగంధకాలు త్రికటుకం ఇంగిలీకరసం సైంధవలవణం లవంగాలు అభ్రకం వసనాభి పిప్పలిమూలం ఇవిసమానముగా హంసపాదాకు రసమున 1 రోజు మర్దనాచేసి కుక్కుట పుటముపెట్టి సాంగశీతలానతీసి చూర్ణముచేసి దానిని మినపగింజంత అనుపాన విశేషములతో ఇచ్చిన జ్వరములుహరించును.

### 195 భార్గవీరసము.

రసగంధకాలు నేపాళాలు సమానములుగా రావిచెక్క కషాయముతో మర్దనాచేసి 1 జాము డోలాయంత్రమున వండి సాంగశీతలాన గురిగింజఎత్తు పిప్పళ్లు పంచదారతో ఇచ్చిన విషమజ్వర సహిత సన్నిపాతములు హరించును.

### 196 నారాయణరసం.

అభ్రకం కటకరోహిణి హరిదళం త్రికటుకం సమానముగా పంచకూల కషాయమున 2 రోజులు మర్దనాచేసి వజ్రపుమూసలో నిడి కోకమన్నులిచ్చి భూపుటమిడి సాంగశీతలాన బుచ్చి నక్క, చేపపీనిపిత్తములతో 2 రోజులు మర్దనాచేసి గురిగింజంత తమలపాకుల రసముతో ఇచ్చిన సన్నిపాతములు దోషజ్వరములు హరించును.

### 197 వైష్ణవీరసం.

శొంఠి పిప్పలి మిరియాలు సమానముగా చిత్రమూల కషాయమున మర్దించి 1 జాము డోలాయంత్రమున వండి చల్లారిన పిదప

మినపగింజంత అల్లపురసమున ఇచ్చినచో ద్వంద్వ జ్వరాలు పురాణ జ్వరాలు సన్నిపాతములు మానును.

198 లక్ష్మీనారాయణరసం.

గంధకం తుత్థం వెలిగారం హారిదళం ఇవిసమానముగా గజ్జేరు వేళ్ళరసమున 3 జాములు మర్దించి డోలాయంత్రమున 1 జామువండి 2 గురివిందల ప్రమాణం అనుపానములతో పుచ్చుకొన్నచో జ్వరాలు సామాన్య జ్వరాలు నివర్తించును.

199 హిరణ్యగర్భరసము.

సువర్ణ రజితతామ్ర పగడభస్మములు రసగంధకాలు మణిశిల హారిదళం కటకరోహిణి సమానములుగా కూర్చి మేకపాలతో మర్దనాచేసి అనుపానములతో 2 వడ్లగింజల ప్రమాణం ఇచ్చినచో వాత పైత్య శ్లేష్మజ్వరములు హరించును. ఇచ్ఛా పథ్యం.

200 కమలాసనరసము.

అభ్రకం రసం గంధకం లోహతామ్ర భస్మాలు సమముగా వేసి వేప ఈనెల రసమున 2 రోజులు మర్దనాచేసి ఆగులికలు గాజు చిప్పలో ఉంచి 7 చీరమన్నులిచ్చి 6 జాములు వాలుకాయంత్రమున సన్ననిమంటమీద వంటచేసి స్వాంగ శీతలానకుదిచ్చి మెత్తగా మర్దనా చేసి కరాటాన ఉంచి 1 వరిగింజంత అనుపానములతో పుచ్చుకొన్నచో దోషజ్వరాలు సన్నిపాతములు నివర్తించును.

201 భారతీ రసం.

రసగంధకాలు అభ్రకం వస వసనాభి సమముగా బోడతరపాకు రసమున రోజు మర్దించి వజ్రపుమూసలో ఉంచి 1 భూపుటమిచ్చి ఊర పిచ్చుకలపైత్యాన 2 దినాలుమర్దించి కరాటానఉంచి గురుగింజఎత్తు అను పానాలతో పుచ్చుకున్నచో జ్వరములు హరించును.

202 ఆనంద భైరవరసము. (శీతాంగ సన్నికి.)

లోహ తామ్ర వంగ నాగ భస్మాలు వెలిగారం ఇంగిలీకం గంధకం పాదరసం హరిదళం సమముగా త్రిఫలరసాన మర్దనాచేసి త్రికటుక కషాయమున డోలాయంత్రములో 1 దినంపక్వముచేసి పాము పైత్యమున మర్దించి గుంజామాత్రలు అనుపానములతో పుచ్చుకొన్న చో శీతాంగ సన్ని నివారించును. పథ్యం చల్లవంటకం.

203 శీతమహారసము.

రసం వసనాభి ఇంగిలీకం కటుకరోహిణి లోహరాగి చిట్టపు భస్మములు హరిదళం సమానములుగా చేర్చి జిలేడు వేళ్లకషాయము న మర్దనాచేసి గుళికలు గాజుబుడ్లలో వేసి కోకమన్నులిచ్చి వాలుకా యంత్రమున 3 జాములు వండి చల్లారనిచ్చి గుంజమాత్రము అనుపానములతో పుచ్చుకొన్న చో జ్వరసన్ని పాతములు హరించును.

204 కల్యాణరసం.

గంధకం హరిదళం శంఖచూర్ణం సమానముగా నిమ్మపండ్ల పులుసున మర్దనాచేసి 1 దినం డోలాయంత్రమున వంటచేసి సాంగశీత లానగుచ్చి 2 వడ్లగింజల ఎత్తు అనుపానములతో సేవించిన సర్వజ్వరములు హరించును.

205 భూతభైరవరసం (సంధిక సన్నిపాతములకు)

శుద్ధమైన రసం గంధకం తామ్రభస్మం సమముగాకూర్చి చిత్రమూలపు కషాయమున మర్దనాచేసి వజ్రపుమూసలో 1 దినం వాలుకా యంత్రమున వంటచేసి పిల్లిపైత్యమునను నక్కపైత్యమునను 2జాములు భావనచేసి గురిగింజఎత్తు అనుపానములతో సేవించిన సంధిక సన్నిపాతము హరించును. పథ్యం పెరుగువంటకం దాహం కొబ్బరినీళ్లు.

206 త్రివిక్రమరసం.

రసం నాభి తాళకం సమభాగాలుగా 2 జాములకాలం గుంటగలగరాకురసాన మర్దనాచేసి వజ్రపుమూసలో తీవ్రాగ్నిని వాలు

కాయంత్రమున 2 జాములు వంటచేసి, సాంగశీతలాన గుచ్చి చూర్ణముచేసి 2 వండ్లగింజలంత వావిలిఆకు రసాన సేవించిన సన్నిపాత శాంతియగును,

## 207 వీరవిక్రమరసం.

రసగంధకాలు వెలిగారం ముషిణిగింజలు, సైంధవలవణం చిత్రమూలము ఇంగువ సమానముగా చూర్ణముచేసి 1 జాముసేపు డోలాయంత్రమున వంటజేసి పందిచేసన మర్దనాచేసి గురిగింజఎత్తు అనుపానములతో సేవించిన సన్నిపాతములు శాంతించును.

## 208 విజయ విక్రమరసం.

వసనాభి మణిశిల హరిదళం గంధకం వెలిగారం సమానముగా నిమ్మపండ్లరసముతో 3 రోజులు మర్దనాచేసి 1 జాము డోలాయంత్రమున వండి సాంగశీతలాన గుచ్చి చూర్ణముచేసి 1 దినం చేపపిత్తమున భావనచేసి గుంజమాత్రము సేవించిన సన్నిపాతములు హరించును.

## 209 శరభేశ్వర రసం.

గంధకం వసనాభి పాదరసం ఇంగిలీకం వెలిగారం సమభాగములుగా చిత్రమూలపు కషాయాన మర్దనాచేసి వజ్రపుమూసలో 2 జాములు వాలుకాయంత్రమున వంటచేసి సాంగశీతలాన గ్రుచ్చిమెత్తగానూరి గురిగింజఎత్తు శొంఠిపిప్పలి మిరియాలతో సేవించిన జ్వరాలు సన్నిపాతాలు నివారించును.

## 210 స్వచ్ఛందభైరవ రసం (కంఠకుబ్జసన్నిపాతమునకు)

పాదరసం గంధకం నాభి వెలిగారం వంగభస్మం ఇవి సమానములుగా 2 దినములు త్రిఫల కషాయమున మర్దనాచేసి డోలాయంత్రమున 1 జాము మందాగ్నిని వంటజేసి పందిచేదున మర్దించి గుంజా

మాత్రము అల్లపురసముతో సేవించవలెను. పథ్యం పెరుగు వంటక దాహమునకు చల్లనీళ్ళు.

211 మదనభైరవరసం. (చిత్తవిభ్రమ సన్నిపాతమునకు.)

రసగంధకాలు సైంధవలవణాం తామ్రభస్మాం సమానములుగా ములగపంటి రసాన మర్దనాచేసి ఉండలుకట్టి వజ్రపుమూసలో వేసి వాలుకాయంత్రమున భూపుటంపెట్టి 3 జాములుంచి సాంగశీతలాన గుగ్రిచ్చి ఆవుపిత్తమున మర్దనాచేసి సెనగగింజలంత కొబ్బరినీళ్లతో గాని త్రికటురసానగాని యివ్వవలెను.

212 విజయభైరవర సం (అత్రిక సన్నిపాతమునకు)

పాదరసం వసనాభి వంగ నాగ అభ్రకభస్మాలు సమముగా 1 దినం త్రికటురసాన మర్దనాచేసి వాలుకాయంత్రమున 2 జాములు వండి సాంగశీతలానగుగ్రిచ్చి కోడిపిత్తాన మర్దనాచేసి సెనగగింజంత కొబ్బరినీళ్ళతో ఇచ్చిన అత్రికసన్నినివారణమగును.

213 సంగరభైరవరసం (హృద్దాహసన్నిపాతమునకు)

తామ్రి లోహాభస్మములు, సద్య, యవక్షారములు, రసము సమముగా పంచకోలకషాయమున 1దినము మర్దనాచేసి, డోలాయంత్రమున 1 జామువండి కోడిపిత్తమున భావనచేసి 2 మినపగింజలంత, తేనె, పిప్పళ్లు అనుపానముతో సేవించిన హృద్దాహసన్నిపాతము శాంతియగును.

214 మనోభైరవరసం (తాంత్రికసన్నిపాతమునకు)

సద్యయవక్షారములు, పంచలవణములు రసం, తామ్రభస్మము సజ్జకారమున్ను, సమముగాజిల్లేడు వేళ్ళ కషాయమున3దినములుమర్దించి, వజ్రపుమూసనుంచి, కోక మన్నులిచ్చి 1 దినం వాలుకాయంత్రమున వండి, సాంగశీతలాన గుగ్రిచ్చి, గోరోభపిత్తమున మర్దనాచేసి, మినపగింజంత తేనెతో సేవించవలెను.

215 కల్యాణ భైరవం (కర్ణికసన్నిపాతమునకు)

నాభి, పాదరసం, సర్పవిషం, గంధకం, పిప్పళ్ళు, సీస, వంగ భస్మములు, సమముగా చిత్రమూలము వేళ్ల కషాయముతో మర్దనా చేసి, మాత్రలుచేసి వజ్రపుమూసలో 1 దినం వాలుకాయంత్రాన వంటజేసి చేపచేదుకట్టున మర్దనాచేసి, సెనగగింజంతమాత్ర అను పానముతో సేవించవలెను. పథ్యము. పాయసము నెయ్యి చెరుకులు పంచదార పథ్యం.

216 విదారణభైరవము (భగ్ననేత్రసన్నిపాతమునకు)

పాదరసం, తామ్రవంగభస్మములు, గంధకం సమముగా జిల్లేడుపాలతో మర్దనాచేసి, 1 జాము డోలాయంత్రమున వంటచేసి, చల్లారినపిమ్మట, ఇర్రిచేదుకట్టున మర్దనాచేసి, గుంజామాత్రము శొంఠి, పిప్పలి, మిరియాలు, అనుపానముచేసి యివ్వవలెను. పథ్యం ముక్కుటం పోసేది.

217 వాతభైరవం (రక్తేష్టి సన్నిపాతమునకు)

రసం, నాభి, అభ్రకం, గంధకం, సీసభస్మం, సమానములుగా మర్రిపాలతో 1 దినం మర్దనాచేసి డోలాయంత్రమున వంటచేసి, మీనుచేదుకట్టునను, ఎనుబోతు చేదుకట్టునను, నెమలి చేదుకట్టునను ఒక్కొక చేదుకట్టున ఒక్కొకరోజు మర్దనాచేసేది. 2 మినపగింజలంత పిప్పలి కషాయమున సేవించవలెను.

218 కారుణ్యభైరవం (ప్రలాపసన్నిపాతమునకు)

అభ్రకం, శుద్ధిమైన పాదరసం, సమానముగా, గుంటకలగరాకు రసమున మర్దనాచేసి, వజ్రపుమూసలో ఉంచి, వాలుకాయంత్రమున 1 జామువండి, సాంగశీతలాన అడివిపంది చేదుకట్టుననూ నెమలి చేదుకట్టుననూ మర్దనాచేసి, అనుపానములతో మినపగింజంత సేవించవలెను.

219 కరవాలభైరవరసం (అభిన్యాస సన్నిపాతమునకు)

సద్యక్షారం, యవక్షారం, సజ్జకారం, ఇంగువ, పాదరసం, శొంఠి పిప్పలి మిరియాలు గంధకం, సముద్రలవణం, బిడాలవణము, సవర్చలవణము కాచలవణము, సైంధలవణము, సమానముగా చిత్రమూలపువేళ్లతోను వరగోగు వేళ్ళను జిల్లేడువేరు సాగ పుల్లగుమ్మడి దుంపలు కరక్కాయచెక్కలు, తాడికాయచెక్కలు, ఉసిరికపప్పు వసనాభి సమానముగా చేర్చి జిల్లేడువేళ్ళ కషాయమున 2 రోజులు మర్దించి, వజ్రపుమూసలో ఉంచి, వాలుకాయంత్రమున 2 జాములు వంటచేసి నాంగశీతలానబుచ్చి నుక్కచేమున మర్దించి, 2 గురిజెల ప్రమాణం కొబ్బరినీళ్ళతో సేవించేది. పథ్యం పెరుగువంటకం, అనుపానముతో ఇచ్చిన జ్వరాలు శాంతించును.

220 సిద్ధభైరవము (జిహ్వక సన్నిపాతమునకు)

హారదళం, పాదరసం సమభాగములుగా కలబందరసాన మర్దనాచేసి 1 జాము డోలాయంత్రమున వండితీసి చేపచేదున మర్దనాచేసి 2 సెనగగింజలంత తేనెపిప్పలితో సేవించవలెను.

221 రసేంద్రరసము.

రసగంధకాలు అభ్రకం తామ్రభస్మము వసనాభి సమానములుగా జిల్లేడువేళ్ళ కషాయమున మర్దనాచేసి మూసలో ఉంచి వాలుకాయంత్రమున 1 దినము మందాగ్నిమీద వంటచేసేది. సాంగశీతలానబుచ్చి మినపగింజంత అనుపానముతో సేవించిన జ్వర సన్నిపాతాలుమానును.

222 మహేంద్రరసము.

గరళం రసం నాభితాళకం మణిశిల దొష్టిపాషాణము సమానముగా ఉమ్మెత్తాకురసమున మర్దనాచేసి డోలా యంత్రమున ఒకదిన

ము సన్నమంటమీాద వంటజేసి మెత్తగానూరి గురిజఎత్తు అనుపాన ముతో సేవించవలెను.

### 223 లోకేంద్రరసము.

ఇంగిలీకం హారిదళం రసం వసనాభి సమానముగా వేమురసాన మర్దనాచేసి వజ్రపు మూసలోవుంచి కోకమన్నులిచ్చి వాలుకాయంత్రమున 2 జాములు పక్వముచేసి సాంగశీతలానబుచ్చి మేకచేదున మర్దించి గుంజమాత్రము అనుపానములతో సేవించేది.

### 224 రసరాజరసం.

పాదరసం మణిశిల తుత్థం గంధకం ఇంగిలీకం వసనాభి సమానములుగా వేపఈనెలరసమున మర్దనాచేసి ఒకకుక్కుటపుటమిచ్చి సాంగశీతలానబుచ్చి మేక ఎనుబోతుచేప చేదులతో మర్దనాచేసి గుంజమాత్రము త్రికటుకములతో సేవించేది.

### 225 మహాభైరవరసం.

తామ్రమురస లోహ అభ్రక కాంత భస్మములు సమానములుగా నాంపపాదాకురసమున మర్దనాచేసి గాజుకుప్పెలో ఉంచి కోకమన్నులిచ్చి వాలుకాయంత్రమున ఒకనాడువండి సాంగశీతలానబుచ్చి పంది చేదున భావనచేసి గుంజప్రమాణం అనుపానములతో సేవించిన 13 సన్నిపాతములును నివృత్తియగును.

### 226 శృంగారభైరవరసం

ఇంగిలీకం వసనాభి మిరియాలు వెలిగారం పిప్పళ్లు సమానముగా నిమ్మపులుసున 3 దినములు మర్దించి డోలాయంత్రమున 1 జాము పక్వముచేసి మినపగింజంత అల్లపురసాన సేవించిన సన్నిపాతములు అతిసారములు మానును.

### 227 కాలభైరవరసం.

అరదళం గంధకం అభ్రకం రసం వెలిగారం త్రిక్షారములును సైంధవలవణము జోలు మిరియాలు సమానముగా చూర్ణముచేసి మర్దించి డోలాయంత్రమున ఒకనాడునుండి చేపచేదు పందిచేదు ఎనుబోతుచేదు తాబేటిచేదు మర్దనాచేసి అల్లపురసాన మినపగింజంత సేవించిన సన్నిపాతములు మాంచును, పథ్యం పెరుగువంటకము, దాహశాంతికి కొబ్బరినీళ్లు పంచదార పానకము చెరుకులు.

### 228 సూతికాముఖము.

గంధకం తాళకం మణిశిల మయిలతుత్తం పాలతుత్తం నేపాళాలు వసనాభి వెలిగారం ఇంగిలీకం సౌవర్చలవణం అభ్రకం సైంధవలవణం సమముగా చేర్చి వీటికి సరిగా పాదరసం కూర్చి ఇప్పగింజల నూనెతో 3 రోజులు మర్దనాచేసి డోలాయంత్రమున పక్వముచేసి నల్లతాచుచేదున 2 దినములు భావనచేసి కరాటానఉంచి నిమ్మపండ్ల పులుసున మర్దనాచేసి బ్రహ్మరంధ్రము గోరిగి కత్తివాటువేసి గురివెంద గింజంత సేవించినయెడల సన్నిపాతములు మానును. శోఫ పైత్యము కంపము త్రిప్పు హిక్క చెముడు మూగగుణాలు కల్గిన రోగమున్నా మానును.

### 229 మృత్యుంజయరసము.

రసగంధకాలు తామ్రి అభ్రకభస్మాలు తాళకం సముద్రఫేనము సమముగా పొత్తిదుంపరసాన నూరి మూసలో 1 గజపుటం పెట్టి స్వాంగశీతలానఉంచి నెమలి మేక చేపల చేదులను 4 జాములు మర్దించి అనుపానములతో 2 వరిగింజలఎత్తు ఇచ్చిన సన్నిపాతములు హరించును.

### 230 సూతికాభరణము.

అభ్రిక వైక్రాంత సువర్ణ లోహ తామ్రరజిత సీస తగరభస్మములు వసనాభి పాదరసం గంధకం సమాంశముగా కూర్చి వావిలిరసా

నమర్దనాచేసి పిదప గుంటగలగర గజ్జేరు చిత్రమూలం అడ్డసరం తిప్ప తీగె తులసి బోడసరం నిమ్మపంజ్లరసము హాత్తిదుంపలు కలబంద కాకరాకురసాలతో మర్దనాచేసి గాజుకుప్పెలోపోసి కోకమన్నులిచ్చి 1 దినం వాలుకాయంత్రమున పక్వముచేసి చూర్ణము గానూరి చేప అడవిపంది తాబేలు దున్నపోతు పునుగె కస్తు కుక్కను నీరి చేగలతో మర్దించి సూదిమొకు అంతరంగ అనుపానములతో సేవించేది.

## 231 ప్రాణేశ్వరరసము.

రసగంధకాలు హారిదళం అభ్రకం సమముగా నేలతాడిగడ్డల కషాయమున 2 రోజులు మర్దించి గాజుకుప్పెలోఉంచి వాలుకాయంత్రమున 1 దినం పక్వని మంటమీాద వండి సాంగశీతలానవుంచి ఉమ్మెత్తగింజలతైలమున 1 దినం మదించి త్రికటుకతైలముతో మదించి నల్లేరు కానుగ తక్కిలి అగిశ కశివింద కోష్టు అంగారదుంప తిప్పతీగ చేమపాల త్రిఫలాలు గుంటకలగర రసములతో ప్రత్యేక మర్దనాచేసి చేప ఎనుబోతు మేక పంది నెమలిచేపులతో 5 రోజులు మర్దనాచేసి గురిజప్రమాణాం సేవించిన 13 సన్నిపాతములు హరించును.

## 232 మృతోద్ధాపన రసము.

సద్య యవ క్షారములు సజ్జకారము రసం పంచ లవణములు ఇంగిలీకము ఉల్లిపాషాణము గౌరీపాషాణము మణిశిల హారిదళము గంధకం వసనాభి నస్తకి చంగల్వకోష్టు తామ్ర అభ్రక లోహభస్మములు సమానముగా త్రికటుతైలమున మదనా చేసి కుప్పెను బెట్టి వాలుకా యంత్రమున 2 జాములు పక్వము చేసి సాంగశీతలముగా ఉంచి ఉల్లితైలమున నూరి పిదప నేపాళపు విత్తుల తైలమున నూరి ఆపిదప చిత్రమూలపు కషాయమున 3 రోజులు మర్దనా చేసి నెమలి పాము తాబేలు ఎనుబోతు మేకల చేదున ఒక్కొక్క

జాము భావనచేసి గురిగింజ ప్రమాణం కర్పూరంతోగాని పంచదార పానకంతోగాని ఇచ్చినచో సన్నిపాతములు మానును. చావసిద్ధమైన వాడైనను బ్రతుకును.

### 233 బ్రహ్మాస్త్రరసము.

మైలతుత్తం పాలతుత్తం ఉల్లిపాషాణం గౌరీపాషాణం దొడ్డిపాషాణం మణిశిల వసనాభి నేపాళాలు గంధకం అభ్రకం ఇంగిలీకము సైంధలవణం మిరియాలు బిడాలవణము సద్యక్షారము యవక్షారము సజ్జికారము వెలిగారము ఇంగువ సమముగాకూర్చి వీటికి సరియైన పాదరసంపెట్టి జ్యోతిష్మతీతైలమున 5 రోజులు మర్దించి డోలాయంత్రమున 1 దినం పక్వముచేసి కల్వములోఉంచి నెమలి దున్నపోతు చేప అడవిపంది మేక పాము కుందేలు నక్క కుక్క వీనిచేదులతోమర్దించవలెను. గుంజాప్రమాణం నిమ్మపండ్లరసమున నూరి బ్రహ్మరంధ్రం కత్తివాట్లు వేయించి ప్రయోగించినచో అసాధ్యసన్నిపాతములు సయితము నశించును.

### 234. పాశుపతాస్త్రరసము.

గౌరీపాషాణం ఉల్లిపాషాణం దొడ్డిపాషాణం మైలతుత్తం పాలతుత్తం నేపాళాలు హారిదళం వసనాభ వీటికి సమానముగ పాదరసము పెట్టి జిల్లేడుపాలుపోసి మెత్తగానూరి జాముడోలాయంత్రమునపాకము చేసి పాముచేదుపోసినూరి గుంజాప్రమాణము బ్రహ్మరంధ్రం గోరిగించి ప్రయోగించినచో అసాధ్యసన్నిపాతములు నశించును.

### 235. అఘోరాస్త్రరసం.

రసగంధకాలు వసనాభి హారిదళము ఉల్లిపాషాణం నేపాళాలు మైలతుత్తం సమానముగా చూర్ణముచేసి డోలాయంత్రమున 1 దినం వంటకముచేసి పాము ఎనుబోతు చేదులతో 1 దినం మర్దనాచేసి వాడవలెను.

## 236, ప్రళయానలరసము.

వసనాభి ఇంగిలీకం వెలిగారం సద్యక్షారము పాదరసం యవక్షారము సజ్జికారము పంచలవణములు వామం నల్లజీలకఱ్ఱ ఉక్కు-తామ్రము భస్మములు సమానముగా త్రికటుక కషాయమున మర్దనాచేసి మూసలోనుంచి వాలుకాయంత్రమున 6 జాములు వండి సాంగశీతలాన బుచ్చి పాము చేదుకట్టున గురిజయెత్తు అనుపానములతో ఇచ్చినచో 13 సన్నిపాతములు నివారించును.

## 237. రోగవిదారము.

రసగంధకాలు వెలిగారం వసనాభి పిప్పళ్ళు హేమాక్షికం హారిదళం అభ్రకం ఉల్లిపాషాణం గౌరీపాషాణము దొడ్డిపాషాణము సైంధవ లవణము సమానముగా గుంటకలగర ఆకురసమున 3 జాములు మర్దనా చేసి 1 దినం డోలాయంత్రమున వంటకముచేసి త్రికటుక తైలముననూరి పిదప జిల్లేడువేళ్ళ భూపుటమున తైలము తీసి దానిలో 2 జాములు మర్దనాచేసి గుంజాప్రమాణము అనుపానముతో ఇయ్యవలెను.

## 238. వీరప్రతాపరసము.

ఇంగువ వసనాభిసద్యక్షారము యవక్షారము త్రికటుకం తామ్ర సువర్ణ ప్రవాళ మౌక్తికభస్మములు పాదరసం సమానముగా త్రిఫల కషాయమున 3 దినములు మర్దనాచేసి మూసలోనుంచి గజపుటమిడి సాంగశీతలానద్రుచ్చి చేదు నెమలి ఎనుబోతు అడవిపంది వీని చేదులను 5 జాములు మర్దనాచేసి గురివింజఎత్తు అనుపానములతో నిచ్చినచో సన్నిపాతములు నివారించును. ఇచ్ఛాపథ్యము.

## 239. పరంజ్యోతిరసం.

స్వర్ణ, రజిత, వంగ, పగడ, మౌక్తిక, భస్మములును రసగంధకములును, అభ్రకం ఇవి సమానములుగ, గంజాయి ఆకు రసమున

మర్దనాచేసి, మూసలోపెట్టి, వాలుకాయంత్రమున, 1 దినం సన్నని మంటమీద వండి, సాంగశీతలమునఁగ్రుచ్చి, చూర్ణముచేసి మర్దించి, గుంజాప్రమాణము చలినీటితో సేవించినచో, కఫము, అపస్మారము, ధనుర్వాతము, మున్నగు గుణములుగల సన్నిపాతములు హరించును. ఇచ్ఛాపథ్యము.

240. రాజవిరాజేశ్వరీ రసం.

రసగంధకాలు, హరిదళం, సద్యక్షారము, యవక్షారము, ఇంగువ, హేమాక్షికం, వాసము, సమానముగా చిత్రమూలపు వేళ్ళ కషాయమున 2 దినములు మర్దనాచేసి మూసలోనుంచి, కోకమన్నులిచ్చి, వాలుకాయంత్రమున 2 జాములువండి, సాంగశీతలానఁగ్రుచ్చి, చేపచేదున మర్దించి, గురిగింజప్రమాణం అనుపానములతో సేవించిన 13 సన్నిపాతములును నివారించును.

241 గండభేరుండ రసము,

ఇంగిలీకం 2 పాళ్ళు; నాభి 1 పాలు; కటకరోహిణి 4 పాళ్ళు చన్నీళ్ళతో మర్దనాచేసి, గుంజప్రమాణము ఉండలుచేసి, అల్లపురసాన వాడినచో జ్వరములు శాంతించును.

242 అమృతసంజీవ రసము.

శుద్ధిమైన పాదరసము వసనాభి ఇంగిలీకము గంధకం కటకరోహిణి సమానములుగా గుంటకలగరాకు రసముతో 3 రోజులు మర్దనాచేసి మినపగింజంత మాత్రలుకట్టి ఆరనిచ్చి అల్లపురసాన నిచ్చినచో 13 సన్నిపాతములు నశించును.

243 జగన్నాథరసము.

తామ్ర వంగ భస్మములు సమానముగా వులిమిరిచెక్కరసమున 1 దినం మర్దనాచేసి వజ్రపుమూసలో ఉంచి కుక్కుటపుటము

పెట్టి సాంగశీతలాన బుచ్చి అడివిపంది చేదున మర్దనాచేసి 2 వరిగింజ లంత అల్లపురసమున వాడినచో సన్నిపాతములు నశించును పథ్యము గంజి.

## 244 కాలాగ్నిరుద్రరసము.

పంచలవణములు యవసజ్జక్షారములు సజ్జక్షారము నాభి పాదరసము సమముగా త్రిఫలకషాయమున 3 దినములు మర్దనాచేసి మూసలోనిడి 1 దినం వాలుకాయంత్రమున పక్వముచేసి సాంగశీతలాన బుచ్చి చేప నెమలి ఎనుబోతు మేక అడవిపంది నాగుబాము చేదులతో మర్దించి గుంజప్రమాణము అనుపానములతో సేవించిన సన్నిపాతములు హరించును. ఇచ్ఛాపథ్యము.

## 245 ధన్వంతరీ రసము.

స్వర్ణ లోహ మౌక్తిక వంగ భస్మములున్నూ సద్య యవక్షారములున్నూ సజ్జకారము హేమమాక్షికం ఇంగిలీకం పిప్పలిమూలము రసం నాభి సమానముగా చిత్రమూలపు కషాయమునను హంసపాదాకురసమునను జిల్లేడువేళ్ళ కషాయమునను గుంటకలగరాకు రసమునను పంచకోశకషాయమునను 3 దినములు మర్దనాచేసి గాజుకుప్పె లోఉంచి కోకమన్నులిచ్చి వాలుకాయంత్రమున 3 జాములు వంటచేసి సాంగశీతలానబుచ్చి చేప ఎనుబోతు మేక నెమలి అడవిపంది చేదులతో మర్దనాచేసి మినపగింజంత అనుపానాలతో సేవించిన సమస్తరోగాలు హరించును. 13 సన్నిపాతములు మానును, పథ్యం-గంజి పంచముష్టి గంజియున్నూ.

## 246 ఫణిధర రసము.

శుద్ధియైనసీసము తగరము సమభాగములు పెంకులోపోసికరగ నిచ్చి వానితూనికరసం కరిగిన దానిలోపోసి కలియబెట్టి సాంగశీతలాన

బుచ్చి చేపచేమున మర్దనాచేసి గురిజఎత్తు అనుపానములతో ఇచ్చిన సన్నిపాతములు హరించును. పథ్యం-పంచముష్టిగంజి.

## 247 రోగభంజన రసము.

శుద్ధిచేసిన పాదరసము అభ్రకము తామ్రభస్మము వసనాభి సమానముగా నిమ్మపండ్లరసమున 2 జాములు పక్వముచేసి డోలా యంత్రమున 1 దినం వండి నెమలిచేమున మర్దించి 1గుంజమాత్ర ప్రమాణము అనుపానములతో సేవించిన సన్నిపాతములు హరించును.

## 248 ఏకమూర్తిరసము.

శుద్ధిఅయిన ఉల్లిపాషాణము తేనెతో 1 జాము వండి సాంగశీతలానబుచ్చి బాగుగా మర్దనాచేసి పంచదార అనుపానముపెట్టి సెనగగింజంత మాత్రలుకట్టి ఇచ్చినచో వాంతియగును. వాంతిఅయినపిదప పెసలునూకలు వేసి గంజిపోసిన శీతజ్వరాలు మానును.

## 249 ద్విమూర్తిరసము.

మైలతుత్తము పాలతుత్తము ఉల్లిపాషాణము సమానముగా తేనెలో మర్దనాచేసి కాకరాకు రసాన మర్దించి డోలాయంత్రాన 1 జాము వండి సాంగశీతలానబుచ్చి ఉమ్మెత్తాకురసాన మర్దించి గుంజప్రమాణం అనుపానాలతో సేవించిన శీతజ్వరాలుహరించును. పథ్యం పెరుగు గంజి.

## 250 త్రిమూర్తిరసము.

ఉల్లిపాషాణము నేపాళాలు మైలతుత్తము అరిదళము సమానముగా కలబందరసాన 2 జాములు మర్దనాచేసి డోలాయంత్రమున 1 జాము పక్వముచేసి చేపచేమున మర్దించి సెనగగింజప్రమాణం పాలతో సేవించిన ఆహిక అస్తిగతజ్వరములు శాంతించును. పథ్యం- పెసలు బియ్యం వేయించి గంజిచేసి యివ్వవలెను.

### 251 శీతభంజనరసము.

శొంఠి ఉల్లిపాషాణము మిరియాలు పాదరసం మైలతుత్తం పాలతుత్తం సమముగా కాకరాకురసాననూరి మూసలోపెట్టి కోకమన్నులిచ్చి కుక్కుటపుటము వేసి, సాంగశీతలానబుచ్చి చేపచేదున మర్దించి గుంజప్రమాణం చక్కెరతో సేవించిన శీతజ్వరాలు హరించును. పథ్యం-పెసరకట్టు.

### 252 చండభాస్కరరసము.

1 పాలుమైలతుత్తం 2 పాళ్లు హారిదళం 4 పాళ్ళు రాతిసున్నం కలబందరసాననూరి కుక్కుటపుటమిచ్చి సాంగశీతలానబుచ్చి 2గురివెందగింజలప్రమాణం జీలకర్ర అనుపానముతో సేవించిన శీతజ్వరాలు నశించును. పథ్యం-పెరుగు గంజి.

### 253 నవనాథ రసము.

వసనాభి మైలతుత్తం పాలతుత్తం పాదరసం ఉల్లిపాషాణము దొడ్డిపాషాణము హారిదళం గంధకం సమానముగా వెల్లుల్లిరసాననూరి డోలాయంత్రమున 1 దినం వంటచేసి నక్కచేదున మర్దించి 1గుంజప్రమాణం మేకపాలతో సేవించిన శీతజ్వరాలు మానును. ఇచ్ఛాపథ్యం.

### 254 నాగార్జునరసము.

శ్రీగంధం రక్తచందనం ఉల్లిపాషాణం మైలతుత్తం సమానముగా కలబందరసాన నూరి చేపచేదున మర్దించి గుంజప్రమాణం సేవించిన శీతజ్వరాలు నయమౌను. పథ్యం-పెసరకట్టు.

### 255 సూర్యపావకరసము.

ఉల్లి దొడ్డి గౌరీపాషాణములు మైలపాలతుత్తము నేపాళాలు హారిదళం సమానముగా ఉమ్మెత్తాకురసాన నూరి కోకమన్నులిచ్చి

మూసలో 1 పుటంపెట్టి సాంగశీతలానబుచ్చి అడవిపందిచేమునమర్దించి గురిజప్రమాణం జీలకర్రతో సేవించిన శీతజ్వరాలు హరించును.

## 256 శీతగజాంకుశం.

రసం 1 పాలు నాభి 2 పాళ్ళు మైలతుత్తం 3 పాళ్లు ఉమ్మెత్తాకురసాన నూరి, డోలాయంత్రమున 1 జామువండి చూర్ణమునూరి గుంజాప్రమాణం జీలకర్రతో సేవించిన శీతజ్వరాలు శాంతించును.

## 257 షోడశశుద్ధరసము.

ఉల్లిదొడ్డీ గౌరీపాషాణములు హరిదళంమైలతుత్తంరాతిసున్నం నేపాళం సమానముగా పంచదారపానకముతో నూరి డోలాయంత్రమున 1 జామువండి ఎలుకచేదుపోసి మర్దనాచేసి పంచదార అనుపానముతో 1 గురిజప్రమాణం సేవించిన శీతజ్వరాలు హరించును.

## 258 విష్ణుపరాక్రమరసం.

రసగంధకాలు వెలిగారం వసనాభి సద్య యవక్షారాలు సజ్జక్షారం సైంధవలవణం సమానముగా ఉమ్మెత్తాకురసాననూరి మాత్రలుచేసి 1 కుక్కుటపుటమిచ్చి సాంగశీతలానబుచ్చి పంది, చేపచేదులతో మర్దించి మినపగింజంత సేవించిన విషమ శీతజ్వరాలు శ్వాసలు సంధీమూగ తాపము కఫము ధనుర్వాతము హరించును.

## 259 పెట్టుమందుకు.

నల్లేరువిత్తులుగావి వేళ్లుగాని చల్లతోనూరి త్రాగిన పెట్టుమందువిరుగును. 2 వెలగపంటివిత్తులు నల్లజీలకర్ర నిమ్మకాయంత పంచదార కలుపుకొని త్రాగిన పెట్టుమందు విరుగును.

## 260 వీర్యవృద్ధికి.

పెన్నేరుగడ్డ, నల్లనువ్వులు, నాగబలమినువులు, జీలకర్ర, బెల్లము, సమముగానూరి చలినీళ్ళతోపుచ్చుకొన్నచో వీర్యవృద్ధికల్గును.

## 261 కుష్ఠుగజాంకుశం.

దుంపకారుకచ్చ, తగిరిస, మకంటకపు, గుంటకలగర, ముషిణివిత్తులు చూర్ణము ఇంగిలీకం గంధకం, వెలిగారం, పాదరసం, మణిశిల, రసాంజనం గ్రంధితగరం, హరిదళం, రావోటిత్రిఫలాలు, మైలతుత్తం,నీలాంజనం, కవిరి, హియ్యావళిదుంపలు, సమానముగా కరివేపాకురసాన త్రిఫలకషాయమున మర్దించి పైనపూసినచో అష్టాదశకుష్ఠులు మానును.

## 262 నేత్రరోగ చికిత్స.

80 నువ్వుపువ్వులు, 16 మిరియాలు, 50 జాజిపూవులు, 60 పిప్పలివిత్తులు, నీళ్ళతోనూరి కణికలుగాచేసి, నీళ్ళరాచి కళ్ళకువేసిన సకల నేత్రరోగములు హరించును. శంఖం చనుపాలతో అరగదీసి రాచినచో కనుపొరలు పోవును.

## 263 ఫణిభూషణరసము.

వంగ, నాగ, అభ్రకభస్మములును, ఇంగిలీకం, సమముగాకలిపి వీనికి సమానముగా పాదరసంవుంచి, వాకిలాకురసాన మర్దనాచేసి, మూసలోవుంచి 2జాములకాలం వాలుకాయంత్రాన పక్వముచేసి సాంగశీతలానబుచ్చి చేప తాబేలు ఎనుబోతు అడవిపంది నెమలి వీని పిత్తములతో ప్రత్యేకముగా మర్దనాచేసి 2 వరిగింజల ప్రమాణం అనుపానములతో సేవించిన సన్నిపాతములుహరించును. ఇచ్ఛాపథ్యం

## 264 దవానలరసము.

నాగవంగభస్మములు యవ సద్యక్షారములు సజ్జకారము హరిదళ గంధకాలు పంచలవణాలు నాభి గౌరీపాషాణం సమభాగాలుగా వేపయాకులరసముతో మర్దనాచేసితీవ్రాగ్నిపైన వాలుకాయంత్రాన పక్వముచేసి సాంగశీతలానబుచ్చి నెమలి పాము మేకచేదులతోనూరి

మినపగింజంత అనుపానాలతో సేవించిన దోష జ్వరాలు హరించును పథ్యము పెరుగు వంటకం.

265. ధర్మేశ్వర రసము.

1 పాలు వసనాభి 3 పాళ్ళు మిరియాలు ఏరుపిడకల బూడిద 16 పాళ్ళు చూర్ణముచేసి సేవించవలెను. సన్నిపాతహారి.

266. అర్కేశ్వర రసము.

1 ఫలం ఏరుపిడకలబూడిద 7 సార్లు జిల్లేడుపాలతో భావనచేసి 4వ పాలు మిరియాలు వుంచి బాగుగానూరిన నస్యము సన్నిపాతములు హరించును.

267 కళికేశ్వరరసము.

సైంధవలవణం పిప్పళ్ళు ఇంగువ ఆవునేతితో సమానముగా మర్దనాచేసి కన్నులకు రాచినచో సన్నిపాతములు హరించును.

268 విషూచ్యంజనము.

సైంధవలవణం మిరియాలు ఆముదపు పలుకులుగోమూత్రమున సమముగానూరి మాత్రలుచేసి నిమ్మపండ్లపులుసున కన్నులకుంచిన సన్నిపాతములు హరించును.

269 బాలసూర్యోదయము.

పొగడ గింజలు మిరియాలు సైంధవలవణం గోమూత్రాన సమాంశాలుగానూరి మాత్రలుగాచేసి గోమూత్రిముననే అరగదీసి కళ్ళకురాసిన సన్నిపాతములు హరించును.

270 ఛర్దిగండూషము.

శర్కర కరక్కాయ శొంఠి వెలిగారము పటికి సురేకారము తేనె నిమ్మరసానకలిపి గండూషముచేసినచో వాంతిమానును.

త్రికటుకం సైంధవలవణం ఇంగువ వెలిగారం సవర్చలవణం సమముగానూరి మాదీపండ్లరసమునను అల్లపురసమునను కలిపి గండూషము చేసినచో సన్నిపాతములు హరించును.

### 271 సన్నిపాతములకు అనుపానము.

త్రికటుకం సైంధవలవణం వాయిలాకు ములగ వేరుచెక్క జిల్లేడు వేరుచెక్క యవక్షారం వరగోగు చిత్రమూలం అల్లం మంచి ఆవాలు వెల్లుల్లి లవంగాలు పంచకోలం దశమూలం అష్టాదశమూలం మున్న గు కషాయాలు

### 272 దాహము హరించేకషాయము.

వట్టివేళ్ళు కురువేళ్ళు మాగికంధం తుంగముస్తెలు కొత్తిమీరి జీలకఱ్ఱ తుంగముస్తెలు పంచదార కర్పూరం చెంగల్వకోష్టు ఇప్పిమధుకం తామరతూళ్ళు పంచపల్లవములు పంచత్వక్కులు ఉసిరికాయలు తిప్పతీగ ఈమున్నెన్నస అనుపానాలు దాహహరాలు.

### 273 నేత్రవ్యాధులకు ఆనందభైరవము.

ఇంగిలీకం నాభి త్రికటుకం గంధకం వెలిగారం ఒక్కొక్కటి 3 గ వంతున నిమ్మపండ్లరసముతో 4 జాములు నూరించి గురివిందగింజ ప్రమాణం మాత్రలుచేసి నీడను ఎండనిచ్చి జ్వరాలకు అల్లపురసమునను అజీర్ణాలకు గలిజేరాకు రసముననను మిగతవ్యాధులకు తమలపాకు రసమున ఈయవలెను. పాము కరచినచో కంటికి వేయవలెను. తేలుకుగూడ ఇదేవిధం. విషములు నివారించును.

### 274 రాజమృగాంకం.

రస తామ్ర ఉక్కు, అభ్రక నవరత్నభస్మములు కాంతసిందూరం చిట్టపుచూర్ణములన్నీ 1 గ మోతాదున చిత్రమూలం కలబంద అల్లం హంసపాదిరసములునూ మూలికలునూ మర్దనాచేసి మాత్రలు కట్టి 3 రోజులు వాలుకా యంత్రమునవండి సాంగశీతలానబుచ్చి నేల తాడిదుంప కొబ్బరిగుంజు వెలిగారం బూరుగుజిగురుగ ఎత్తు చూర్ణము చేసి మినపగింజంత మాత్రలుకట్టి నేతితో సేవించేది. తరువాత చల్ల తాగవలెను. ఇందువలన వింశతి మేహములు బహుమూత్రములు అను

పానములతో ఇచ్చిన శుక్లమేహములు జ్వరాలు మేహములు సన్నిపాతములు నివారణమగును.

275 మహాజ్వరాంకుశం.

రసం నాభి ఒక్కొక్కటి 1గ మాత్రమున్ను గంధకం వెలిగారం ఒక్కొక్కటి 2 గ మాత్రమున్ను మిరియాలు 5¾ గ మాత్రమున్ను నేపాళాలు 6 గ నీటితో మర్దనాచేసి మిరియప్రమాణం మాత్రలుచేసి అల్లపురసముతో ఒక్కొకమాత్ర సేవించినచో జ్వరాలు హరించును. స్త్రీదోషాలకు పంచకోలకషాయముతో యివ్వవలెను.

276 శీతగజాంకుశం.

రసం 1 గ ఉల్లిపాషాణం 2 గ పాలతుత్తం 4 గ పైడిఉమ్మెత్తాకు రసమునను గురివిందాకురసమునను మర్దనాచేసి మాత్రలు కట్టేది.

277 స్వచ్ఛందభైరవరసము.

రసగంధకాలు నాభి జాజికాయ ఒక్కొకతులం వీనికిసరిగా పిప్పలిచెట్టుతోనూరి ధాన్యపుటమందు 3 మండలములుంచి 2గురివిందగింజలంత అల్లపురసముతోగాని తమలపాకు రసముతోగాని శొంఠిజీలకర్రతోగాని ఇచ్చిన-సో దోషాలు హరించును.

278 సన్నిపాత భైరవరసము.

రసగంధకాలు తాళకంమణిశిల వెలిగారం ఒక్కొకతులం వసనాభి మూడుతులాలు ఇంగిలీకం 1గ చిత్రమూలపుకషాయమునను నిమ్మపండ్లపులుసునను అల్లపురసమునను మర్దనాచేసి గురువింద గింజంతమాత్రలుచేసి నీడను ఎండబెట్టి అల్లపురసమున ఇచ్చిన సన్నిపాతములును శొంఠితో ఇచ్చిన అతిసారాలును నివారించును.

279 మహాజ్వరాంకుశము.

ఇంగిలీకం నాభి వెలిగారం మిరియాలు ఒక్కొకతులం నిమ్మపండ్లరసము 1 జా [illegible] నేపాళాలు చేసినీడ నెండిం

చి అనుపానవిశేషాలతో శీతజ్వరాలకు అల్లపురసముతోను త్రిదోషాలకు త్రికటుకముతోను సన్నిపాతమునకు వావిలాకురసమునను జ్వరాతిసారాలకు జీలకర్రతోను కడుపుజబ్బులకు శొంఠితోను మేహమునకు తంగేడుపువ్వుల అగురుతోను ఇచ్చినరోగహారమౌను.

280 వసంతకుసుమాకరము.

బంగారం X 2 ఎత్తు వెండిX 2 వంగభస్మంX 3 కాంతంX 3 నాగభస్మంX 4 రసముX 4 పగడభస్మంX 4 ముత్యపుభస్మంX 4 ఆవుపాలు అడ్డసరపుఆకురసం వేళ్లతోను వట్టివేళ్ళు మానుపసుపు మంచిపసుపు బూరుగువేళ్ళు పీవిరసాలతో ప్రత్యేకంగా ఏడేసి పర్యాయాలు భావనచేయవలెను అనుపానము పంచదార తేనె నెయ్యి.

281 మృగాంకము.

రసభస్మము గంధకం సువర్ణభస్మం 3 X ప్రమాణంతామ్రభస్మం 1 X ప్రమాణం తాళకంమణిశిల 2 X ప్రమాణం శుద్ధిచేసి చూర్ణముగానూరి పచ్చగవ్వలలోపోసి ఆగవ్వలమీద వెలిగారం మేకపాలు పోసి నూరి మూసలో వుంచి ఆమూసమీద పెంకుమూతవేసి కోకమన్నిచ్చి పుటముపెట్టి గవ్వలతో నూరుకోవలెను,

282 నారసింహరసము.

నేపాళం గంధకం అమృతం పాదరసము సమానముగాచూర్ణముచేసి గుంజమాత్రము పంచదారతో ఇచ్చేది.

283 సంజీవినీరసం.

రసగంధకాలు నాభి పిప్పళ్లు ముషిణిపళ్ళరసానమర్దించి గురివిందగింజలంతేసి వటుకాలుచేసేది. గరిటెడు అల్లపురసమున వావిలాకురసాన గరిటెడు వంటకముపెట్టి ఇచ్చేది.

284 కనకసుందరరసము.

ఇంగిలీకం అమృతం మిరియాలు వెలిగారం పిప్పళ్లు సమానముగామర్దించి గుంజమాత్రము తేనెతోఇచ్చిన జ్వరము మానును.

### 285 మదనకామేశ్వరరసము.

గుంటకలగర ఉల్లి గంజాయి లింగపొట్లవిత్తనాలున్ను చంగల్వ కోష్టు పైడిఉమ్మెత్తగింజలు యాలకులు జాపత్రి జాజికాయలుచూర్ణ ముచేసి 1 భాగముమెత్తు కర్పూరము వేయవలెను. తరువాత కొబ్బరి నీళ్లుపారబోసి అందులోవీనినివేసి పుటంపెట్టి టెంకాయనీళ్ళతోనూరి పోకలంతమాత్రలుచేసి సేవించవలెను.

### 286 శీతమాతంగేశ్వరము.

రసగంధకాలు హారిదళం మాక్షికం తుత్తం సమానముగా కాకరాకురసాన మర్దనాచేసి రాగిచిప్పఅడుగున ఆముదముపట్టించి పుటముపెట్టి తీసిమర్దించి గుంజామాత్రము తమలపాకురసముతో సేవించిన జ్వరములు హరించును.

### 287 విద్యాధరరసము.

త్రికటుకం త్రిఫలాలు రసగంధకాలు సైంధవలవణా వెలిగారం వీనికిసమముగా నేపాళాలు ఉంచిచూర్ణముచేసి గుంజమాత్రమిచ్చిన జ్వరాలుహరించును.

### 288 త్రిలోకరత్నామణిరసం.

రసగంధకాలు నాభి వెలిగారం ఇంగిలీకం హారిదళం తామ్ర భస్మము నేపాళాలు సమానముగా అల్లపురసానసూరి గుంజమాత్రము అల్లపురసాన సేవించిన సన్నిపాతములు హరించును.

### 289 అగ్నికుమారరసము,

రసగంధకాలు వెలిగారం వసనాభి తామ్రభస్మము మిరియాలు సమముగా జిల్లేడుపాలతోనూరి వజ్రపుమూసలోఉంచి ఆమూసను 12 జాములు వాలుకాయంత్రమునవండి మర్దనాచేసి గుంజప్రమాణం వరగోగుచెక్కతో ఇచ్చేది.

### 290 దినార్ధజ్వరమునకు.

పాలునాభి 2 పాళ్లురసం 3 పాళ్లువెలిగారం 4 పాళ్లునేపాళాలు 5 పాళ్లుఇంగిలీకం వేడినీళ్ళతోమర్ధనాచేసి గుంజమాత్రము వటుకాలు చేసి ఒక్కొక్కటి శర్కరతో ఇవ్వవలెను. విషజ్వరములకు అల్లపు రసముతో ఇవ్వవలెను.

### 291 శూలబడబానలము.

ఇంగిలీకం మైలతుత్తం అమృతం గంధకంరసం ఉమ్మెత్తగింజలు సమానముగా ఉమ్మెత్తాకురసాననూరి 3 జాములు కలబందరసాన వేర్వేర మర్ధనాచేసి సెనగగింజంత ఉండలుకట్టి ఒక్కొక్కఉండ గచ్చపప్పు పెరుగు నూనెతో యిచ్చిన శూలలుహరించును.

### 292 మృత్యుంజయరసము.

రసగంధకాలు నేపాళాలు తాళకం మణిశిల హేమాక్షికం నాభి తామ్రభస్మంసరిగా నేలతాడిదుంపల రసానమర్ధించి రాగికుప్పె లోఉంచి పైన తమలపాకులుపరచి ఆపైన మన్నుమెత్తి కుక్కుటపుట మీాయవలెను. గంధకపువాసనరాగానే దింపవలెను. పిదపనూరి కరా టానవుంచి పంచదారతో గుంజమాత్రము ఇచ్చిన తాపజ్వరాలు శాంతించును. వేడినీళ్లుచల్లార్చి త్రాగించి గంజిపోయవలెను.

### 293 వ్యాధిగజకేసరము.

రసగంధకాలు తామ్రభస్మము లోహభస్మము యాలకులు లవంగాలు ఆకుపత్రిం ముస్తలు త్రికటుకం తిఫ్రిలాలు చిత్రమూలం రేణుకలు విళంగనారాలు లవంగకుసుమం భారంగి ఇవిసమానముగా చూర్ణముచేసి సగముమెత్తు పాంత్రించెరకడంబెట్టి మర్ధనాచేసి గుంజ మాత్రం అనుపానములతో సేవించిన సర్వరోగములు హరించును.

### 294 శీతజ్వరముఖబాణము.

గౌరీపాషాణం 1 పాలు కవిరి 2 పాళ్లు తాళకం 4 పాళ్లు రాసు న్యం 4 పాళ్ళు మాచిరాకుపసరుతో మర్ధనాచేసి గుంజమాత్రమువటు

కాలుచేసి చలివెంకులకు ఒకటి జీలకర్రతోను వేడినీళ్ళతుమర్దనాచేసి ఇచ్చినచో జ్వరములు హరించును. పెసరగంజి యివ్వవలెను.

### 295 సింధూరయోగము.

గంధకం గ3 స్వర్ణభస్మం గ3 తామ్రభస్మం గ1 మణిశిల గ2 గంధకం గ2 తాళకం గ7 శుద్ధిచేసి చూర్ణముచేసి పచ్చగవ్వలో ఉంచి వానిపై వెలిగారము మేకపాలుపోసి నూరి ఎండనిచ్చి ముంతలోబెట్టి దానిపైన పెంకుమూతవేసి కొకమన్నులిచ్చి పుటంబెట్టి గవ్వలతో నూరవలెను.

### 296 సింధూరయోగము 2.

రసగంధకాలు ఒక్కొకపాలు నిమ్మపండు కలబంద చిత్రమూలము తులశి త్రిఫలములు హంసపాదిఆకు సహదేవిఆకు పారిభద్రగోరింటాకు వీనిరసములతోను తేనెతోను భావనచేసి నీడ నెండించి గాజుకుప్పెలోపోసి కొకమన్నులిచ్చి వాలుకాయంత్రమున కుప్పెపెట్టిమూకుడుమూసి సన్నదీపాన 3 రోజులువండి సాంగశీతలానగ్రుచ్చి తీయవలెను.

### 297 సర్వజ్వరాంతకరసము.

తాళక లోహ తామ్ర కాంత నాగ భస్మములును అభ్రకం ఉల్లిపాషాణం గలిజేరువేళ్ళు కపురి సమానముగా కలంగర కశివెంద గలిజేరువేళ్లు బారిజపాకురసాలతో మర్దనాచేసి ముద్దగాచేసి మూసలోవుంచి వాలుకాయంత్రమునవండి అనుపానములతో సేవించిన జ్వరాలుహరించును.

### 298 దినార్ధరసము (ఇంకొకప్రక్రియ.)

1 పాలురసం 2 పాళ్లుగంధకం 4 పాళ్లు నేపాళాలు 3 పాళ్లు ఇంగిలీకం వజ్రదంతివేళ్లరసాన మర్దనాచేసి గుంజమాత్రం పంచదారతో సేవించిన 2 పూటలకు జ్వరముశాంతించును.

## 299 కనకసుందర రసము (ఇంకొకవిధము)

నాభి ఇంగిలీకం గంధకం పిప్పళ్ళు వెలిగారం ఉమ్మెత్తవిత్తులు మిరియాలు సమానముగా గంజాయిఆకురసముతోగాని అకళికషాయముతోగాని 2 జాములుమర్దనాచేసి సెనగగింజలంత మాత్రలుసేవించిన గ్రహణులు శ్లేష్మాలు అజీర్ణములు జ్వరాతిసారాలు శాంతించును.

## 300 పూర్ణచంద్రోదయము.

స్వర్ణం 1 పాలు రసం 8 పాళ్ళు గంధకం 16 పాళ్లుపయిడిపత్తిగింజలకషాయానమర్దనాచేసి తరువాత కలబందరసాన మర్దించేది. ఇది గాజుకుప్పెలోవుంచి బలపపుకణికెనుబెట్టి దానికి 7 కోకమన్నులిచ్చి వాలుకాయంత్రాన రాత్రింబగళ్లు 3 రోజులువండిన సిందూరించును. దానికిసరిగా కస్తూరి కర్పూరమునుబెట్టి మర్దించవలెను. అనుపానము కస్తూరి శొంఠి పిప్పలి మిరియాలు కర్పూరం యాలకులు లవంగాలు జాజికాయ జాపత్రి నాగకేసరాలు.

## 301 రససింధూరయోగము.

1 భాగం పాదరసం 2 భాగములు అమృతసారగంధకం 1 భాగము నాగభస్మము వీనిని శుద్ధిచేసి గాజుకుప్పెలోఉంచి కోకమన్నులిచ్చి 3 దినములు వాలుకాయంత్రమున సాధువగు అగ్నినివండేది.

## 302 సింధూరయోగము.

రసగంధకాలు సీసభస్మము సమముగా శుద్ధిచేసి పొన్నగంటి చిత్రమూలము హంసపాది గలిజేరు కలబంద కామంచిఆకు రసములతో ప్రత్యేకముగా మర్దనాచేసి గాజుకుప్పెలోఉంచి కోకమన్నులిచ్చి వాలుకాయంత్రమున సన్నని మంటమీద 30 జాములువండిన సింధూరించును.

### 303 ఆనందభైరవము.

త్రికటుకం అమృతసారగంధకం ఇంగిలీకము వెలిగారము వీనిని శుద్ధిచేసి నిమ్మపండ్లరసమునను అల్లపురసమునను మాషప్రమాణం వటుకములు చేసికొనవలెను.

### 304 సన్నిపాతభైరవము.

రసగంధకాలు తాళకం నాభి మణిశిల వెలిగారం ఇంగిలీకము సమముగా శుద్ధిచేసి చిత్రిమూలము నిమ్మపండ్లు అల్లము వీనిరసముల తో 3 దినములుమర్దించి మాషమాత్రము వటుకాలు చేసి వుంచుకొని రోగములననుసరించి అనుపానములతో 2మాత్రలుచొప్పున సేవించేది.

### 305 స్వచ్ఛందభైరవి.

రసగంధకాలు నాభి జాజికాయ పిప్పళ్లు శుద్ధిచేసి తమలపాకులు అల్లము రసాలతోమర్దించి మాషమాత్రపువటుకాలు చేసికొనవలెను.

### 306 విజయభైరవం.

1 పలం నేపాళముగింజలు 4 పలాలుశుద్ధిచేసి నిమ్మపండ్లరసానమర్దించి పెసరగింజలంత మాత్రలుచేసేది.

### 307 వీరవిక్రమరసం.

రసం 8 అమృతసారగంధకం13 మణిశిల4 తాళకం6.శుద్ధిచేసి నానిమ్మపూవులరసాన మర్దనాచేసి గాజుకుప్పెలోఉంచి కోకమన్నులిప్చి వాలుకాయంత్రమున సన్న మంటమీద 3 రోజులు వంటచేసేది.

### 308 రామబాణరసయోగము.

శుద్ధిచేసిన ఉల్లిపాషాణము1 మైలతుత్తం2 పాలతుత్తం4 కాకరాకురసాన మర్దనాచేసి మాషమాత్రపువటుకాలుచేసి 11 దినముల దప 1 మాత్రచొ॥ శీతజ్వరాలకు ఇవ్వవలెను. గెంజిపోయవలెను.

### 309 గ్రహణికి.

ఇంగిలీకం సాంబ్రాణితో పొదిగి నేతితో ఇచ్చేది.

### 310 చంద్రహాసరసము.

పాదరసం 2 పాళ్ళు అమృతసారగంధకం 6 పాళ్ళు ఇంగిలీకం 2 పాళ్లు వెలిగారం 4 పాళ్లు నాభి 2 పాళ్ళు మణిశిల 2 పాళ్లు శుద్ధి చేసి 4 పాళ్ళు సురేకారం త్రికటుకములు 16 పాళ్ళు లవంగాలు 2 పాళ్లు యాలకులు 3 పాళ్ళు జాజికాయ 2 పాళ్లుఇన్నిటికీ సమముగా దంతిబీజములు పెట్టేది. నిమ్మపళ్ల రసమునను గుంటగలగరాకు రస మునను అల్లపురసమునను వావిలాకు రసమునను త్రిఫల రసమునను మాషమాత్ర వటుకముగా చేసి ఎండించివాడేది. అనుపానము రోగ మునమసరించి ఉండును.

### 311 రామబాణ రసయోగము.

మైల తుత్తం 2 పాలతుత్తం 5 ఉప్పిపాషాణము, ఇవిశుద్ధిచేసి కాకరాకు రసాన మర్దనాచేసి వటుకాలుచేసి 11 దినాలు దాటినపిద ప శీతజ్వరాల కిచ్చేది.

### 312 ఇంకొకవిధము.

1X పాదరసం 1X వసనాభి 1X లవంగాలు 1 గంధకం 2 X మిరియాలు 1X జాజికాయ శుద్ధిచేసి చింతపండురసాన మర్దించి మాష మాత్రము వటుకాలు చేసి పురాణజ్వరాలకు ఒక్కొక్కటియివ్వవలెను.

### 313 మహాబాల సూర్యోదయము

గంధకం 3పాళ్ళు రసము 3పాళ్ళు నాభి 3పాళ్ళుతామ్రభస్మం 2 పాళ్లు లోహభస్మం 2 పాళ్లు గవ్వల భస్మం 4 పాళ్ళు అభ్రకభస్మం 7పాళ్లు వీనికి సమముగా మిరియాలు వేసి తమలపాకురసముతోను శొంఠికషాయముతోను చిత్రమూలపు రసముతోను మర్దనాచేసి పిదపనీడను ఆరనిచ్చి మూకుటడుంచి కోకమన్నిచ్చి సన్నమంటను పు

-టము పెట్టవలెను. చల్లారిన దానిని చిత్రమూలపు రసముతో మర్దించి పూట 1కి అడ్డాగెత్తు మాత్ర సేవించిన జ్వరాలు శ్వాసలు దగ్గులు వాంతులు పాండువ్యాధులు శూలలు మేహాలు మూలశంకలు హృద్వ్యాధులు ప్లీహ గుల్మయోని క్షయ వ్యాధులు పీనసలు మందాగ్ని అరుచి శ్లేష్మవ్యాధులు లింగదోషాలు మూత్రకృచ్ఛ్రములు మున్నగు వ్యాధులు నిశ్శేషమగును.

### 314 లోహరసాయనములు.

గంధకం 4పాళ్ళురసం 4పాళ్లు లోహపురజను 11పాళ్లు ఇవి కలబందరసముతోను హంసపాదాకు రసముతోను చిత్రమూల రసముతోను మర్దనాచేసి మూసలోవుంచి కోకమన్నులిచ్చి సన్నమంటను 3 జాములువండి సాంగశీతలాన తీసి హంసపాదాకు రసముతోను చిత్రమూలపురసముతోను సంబరేణి ఆకురసముతోను గుంటకలగరాకురసముతోను అడ్డసరపు ఆకురసమున చెముడుకషాయముతోను మర్దనా చేసి పూట 1కి అడ్డిగెత్తు ఔషధము అనుపానములతో సేవించినచో శ్వాస కాసలు వాంతులు పాండువులు హృదయ వ్యాధులు కామిలలు పీనస మృత్పాండువులు శోభులు హరించును.

### 315 శీతాంశు రసము.

తాళకంతు 1½ మణిశిల తు 1½ శొంఠి తు 1 పిప్పళ్లు తు 1 మిరియాలు తు1 అల్లపురసముతోను నిమ్మపండ్ల రసముచేతను 3 దినాలు మర్దనాచేసి పూటకు చిన్నమెత్తున అనుపానాలతో సేవించినచో శ్లేష్మములు శ్వాసలు వగర్పులు పైత్యములు సర్పులు కర్ణరోగములు నాసారోగములు గళరోగములు వ్రణరోగములు నేత్రరోగములు మొదలగు రోగములు నశించును.

### 316 అగ్నికుమార రసము. (శూలలకు)

శుద్ధియైన రసగంధకాలు వెలిగారం సమముగాను నాభి 3 భాగములు శంఖ భస్మము 2 భాగములు మిరియాలు 8 భాగములు ఇవి

యన్నియు చూర్ణము చేసి నిమ్మపండ్ల రసముతో మర్దించి 2 గురిగిం జల ప్రిమాణము మాత్రలుచేసి ఉపయోగించిన సర్వశూలలు నివారించును.

### 317 మహావాత విధ్వంసి మాత్రలు.

రసగంధకాలు నాగవంగ భస్మాలు లోహం అభ్రకం తామ్రభస్మం నాభి త్రికటుకం తాడికాయచెక్కలు ఉశిరికపప్పు ఇంగిలీకం వెలిగారం సమానముగా చిత్రిమూలము నిమ్మపండ్లు అల్లము వావిలాకు జిల్లేడువేళ్ళు గుంటకలగరాకు వెల్లుల్లి ములగచెక్కరసాలతో వేరువేరుగా ఒక్కొక్క దినం మర్దించి పిదప కుప్పికట్టికొని సెనగగింజలంత మాత్రలు వాడినచో వాతములు హరించును.

### 318 వాతవిధ్వంసి మాత్రలు.

రసగంధకాలు తామ్రలోహ మాక్షిక భస్మాలు నేపాళం తాళకం త్రికటుకాలు సమానముగా 2 భాగములుగాచేసిచూర్ణముచేసి వావిలాకు కంద జిల్లేడు గుంటకలగరాకు తక్కెడు ఉమ్మెత్తరసములందు 7 సార్లు మర్దించి 2 గురిజలంత మాత్రలుచేసి మిరియాల చూర్ణముతో సేవించవలెను. మోకాళ్ళపిక్కలు తొడలు వెన్నుపాదములు చీలమండలు పెదవి తల వీనిలో నొప్పి పెడతల పెద్దనరమును దవడలు వెన్నుక్రింద భాగము వీనియందు స్తంభనము శుష్కవాతము జిహ్వాస్తంభవాతము బాహుస్తంభము జఠరస్తంభము అధోభాగమునపుట్టిన వాయువు సర్వవాయువులు నశించును.

### 319 కోష్ఠవాతమువకు స్వచ్ఛందమాత్రలు.

రసం నాభి గంధకము శుద్ధియైన నేపాళం సమముగా అతివస చిత్రమూలములతో చూర్ణముచేసి జిల్లేడువేళ్ళ కషాయముతో 1 జాము మర్దనాచేసి డోలాయంత్రమున 1 జామువండి గురిజంత సేవించిన కోష్ఠవాతములు వాతములన్నియు హరించును.

### 320 రసానంద భైరవిమాత్రలు.

నాభి ఇంగిలీకం రసకర్పూరం రససిందూరము త్రికటుకాలు వెలిగారం లవంగాలు సమముగా చూర్ణముచేసి నిమ్మపండ్ల రసాన 13 జాములు మర్దించి సెనగగింజలంత మాత్రలుచేసి పుచ్చుకొన్నచో సమస్తపైత్యములు మరియు అనేక రోగము నివృత్తియగును.

### 321 ఆనంద భైరవి మాత్రలు.

త్రిఫలాలు త్రికటుకం ఇంగిలీకము నాభి వెలిగారం సమముగా చూర్ణముచేసి నిమ్మరసమున నూరి సెనగగింజంత మాత్రలు ఇవ్వవలెను.

### 322 వహ్నికుమారమాత్రలు.

రసగంధకాలు శంఖ భస్మము పేల్చినవెలిగారం సమముగాను శుద్ధిచేసిన నాభి 3 భాగములు మిరియాలు 8 భాగములు ఇవిగుంట కలగరాకు రసానసూరి సెనగగింజలంత మాత్రలు సేవించేది.

### 323 తరుణార్క రసమాత్రలు,

అభ్రకభస్మం నాభి గరళం రక్తచందనం వంగభస్మము వెలిగారం ఇవి సమానముగా చేర్చి 3 దినములు మర్దించి శనగిజలంత మాత్రలు అనుపానములతో సేవించినచో సర్వ జ్వరములు హరించును.

### 324 రసానంద భైరవి. (మరొక విధము.)

పాదరసం ౧ భాగం నాభి ౧ భాగం గంధకం ౧ భాగం జాజికాయ ౪ తులాలు పిప్పళ్ళు భాగం 3 ఈనిమసులు చూర్ణముచేసి తేనె తమలపాకు రసమున మర్దనాచేసి గురిజప్రమాణం మాత్రలుచేసి అల్లపురసము తమ్మిపూల రసము అనుపానములతో సేవించిన సకలజ్వరములు అజీర్ణము వాంతి శిరోరోగములు అగ్నిమాంద్యము జలుబు నివారణ మగును. చంటిపిల్లలకు పెసరగింజంతచాలును.

### 325 సౌవీరసంజీవమాత్రలు.

నాగవార ఆకుజెముడు రసములు 3 సోలలు మూకుట్లో వుంచి 1 తులం సౌవీరం పొడిచేసి పైరసములలో నుంచి సన్ననిమంటపై వుడికించి గురిజంతమాత్రలుచేయవలెను. శొంఠి తేనెతో బాగుగా నూరి మాత్రలకు మాటుచేసి యిచ్చేది వాయువులకు 6 మాత్రలు సన్నిపాతములకు 3 మాత్రలు సవాయికి 9 మాత్రలు. పథ్యము వెసురుబియ్యపు అన్నము, జొన్నఅన్నము వేయించిన ఉప్పు ఆవుమజ్జిగ ఉష్ణము పొంగినచో కాచు తుమ్మాకు పటికె తనులపాకులతొడిమెలు 3 సోలలనీళ్ళలోవేసి 8 భాగం మిగిలేవరకు కాచి వడపోసి ప్రొద్దునపూట 3 రోజులు యివ్వవలెను. ఉష్ణము పొంగనిచో కషాయముక్కరలేదు.

### 326 స్వచ్ఛందమాత్రలు. (వాతములకు.)

శుద్ధియైన రసం లోహభస్మము స్వర్ణమాక్షిక భస్మము గంధకం తాళకం కరకపిందెలు ఆముదపుగింజలు వావిలి త్రికటుకం వేచిన వెలిగారం శుద్ధియైన నాభి సమముగా వావిలాకు రసాన 1 దినం మర్దనాచేసి బోడతరరసముతో 1 దినంమర్దించి 2 గురిగింజలప్రమాణం మాత్రలుచేసి వాడవలెను. అనుపానం దుంపరాష్ట్రిం తిప్పతీగె దేవదారుచెక్క శొంఠి ఆముదపువేరు వీనికషాయముతో గుగ్గిలపుచూర్ణమున్నూ పుచ్చుకొన్నచో వాతములు హరించును.

### 327 స్వచ్ఛందమాత్రలు. (కోష్ఠవాతములకు)

నాభి గంధకం రసం నేపాళం శుద్ధిచేసినదిన్ని సమముగా అతివసచిత్రమూలము ఆపైచెప్పిన 6 వస్తువులునూ చూర్ణముచేసి జిల్లేడువేళ్ళ కషాయముతో 1 జాము మర్దించి, డోలాయంత్రమున 1 జాము వండి గురిగింజప్రమాణం సేవించిన కోష్ఠవాతములు హరించును.

### 328 లఘుసూర్యావర్తిమాత్రలు.

2 తులాలఅభ్రక భస్మము 2 తు శుద్ధిమైననాభ 2 తు తిప్పసత్తు 2 తు వెలిగారం తు ½ మాక్షికభస్మం తు 1½ సత్తుభస్మం తు 1½ లవంగాలు తు 1½ వీనికి సయానముగా ఇంగిలీకము ఉంచి అన్నిటిని చూర్ణముచేసి నిమ్మపండ్లు ద్రాక్షపండ్లు దానిమ్మ పెద్ద వుసిరిక చింతపండు అల్లము మాదిఫలము పులిచెంచలాకు జీలకర్ర ఆరంజి పండ్లు నారదబ్బపండ్లు వీనిరసాలతో వేరువేరుగామర్దనాచేసి మృదువైన పానకమువచ్చేవరకు మర్దనాచేసి కుప్పి చెట్టునీడను ఆరనిచ్చి వెదరుగొట్టములోదాచి సెనగగింజలంతేసి మాత్రలుచేసి వాడవలెను దీనివలన ఉన్మాదాలు పైత్యాలు నివర్తించును.ఇది శ్రేష్ఠయోగము.

### 329 వాతరాక్షసం. (కుప్పెకట్టు)

తగర సీస కాంత సువర్ణ రజిత భస్మాలు శుద్ధిచేసిన నాభి ఇంగిలీకము వెలిగారము పాలతుత్తనేపాళాలు సమముగాచేర్చి త్రికటుకముల కషాయముతో 1 దినం మర్దనాచేసి నీకను గుళికలు ఎండబెట్టి కాశీకుప్పెకు కోకమన్నులిచ్చి వాలుకాయంత్రాన మందాగ్నిని 2 జాములువండి సాంగశీతలానబుచ్చి అనుపానములతో అడ్డిగఎత్తుసేవించిన సకల వ్యాధులు నివారణమగును.

### 230 శీతాంశురస మాత్రలు.

మణిశిల తాళకం శొంఠి ఒక్కొకతులం మిరియాలు 2 తులాలు చొప్పున 3 రోజులు నిమ్మపండ్లరసాన మర్ధించి సెనగగింజ లంతమాత్రలుకట్టి తేనె అల్లము ధనియాలరసముతో వేడినీళ్ళతో సేవించినచో పైత్య శీత జ్వరములు పైత్యవాతములు నివారణమగును.

ఈమందు నీళ్ళతోగాని నిమ్మరసముతోగాని కంటికి వేసినచో సకల శిరోభారములును నివారించును.

331 పైత్యవాయువులకు మాత్రలు.

2 పాళ్లు గాడిదగడపాకు 1 పాలు ఉప్పు మంగలానవేసి బూడిదచేసి వలసినప్పుడు నీటితోకుంకుడుగింజంత తేనెతో సేవించిన ఆ కలినయమగును.

332 వాయువు మాత్రలు.

రసకర్పూరము వాయువిళంగాలు ఒక్కొక్క పలం చొప్పున కూర్చి 125 పాపటకాయలరసముతో మర్దనాచేసి మిరియాల ప్రమాణం మాత్రలుకట్టి తిప్పతీగ అకునూరి చేర్పవచ్చును, ఇచ్ఛాపథ్యము.

333 ఆనందభైరవీమాత్రలు.

త్రికటుకం వసనాభి ఇంగిలీకం నిమ్మకాయపులుసుతో మర్దించిపెసరగింజంత మాత్రలుకట్టి నీడను ఎండించి కాకరు ముది మిరియాలకషాయముతో సేవించేది. పైత్యవాయువగానున్నచో తమల పాకులతో ఇవ్వవలెను. ఇచ్ఛాపథ్యం.

334 మేహాంతకరసాయనమాత్రలు

1 తులం ఇంగిలీకం 1 తులం రససిందూరము 2 తులాల శిలాజితు ½ తులం లవంగాలు 5 కర్పూరపుపళ్లు కషాయముపెట్టి దానిలో మర్దనాచేసి మాత్రలు కట్టవలెను.

335 అజీర్ణహర మాత్రలు.

రసకర్పూరము చనుపాలలో శుద్ధిచేసి శొంఠిపొడి వస్త్రగాళితంపట్టి 2 పాళ్లను చనుబాలతో మర్దనాచేసి పెసగగింజంత మాత్రలు కట్టుకోవలెను.

336 శీతలహార మాత్రలు.

మిరియాలు కరక్కాయ సన్నరాష్ట్రము పసుపుసమముగాదంచి వస్త్రఘూళితంచేసి పటికబెల్లపు పానకముతో మర్దించి కుంకుడు గింజంత మాత్రలు చేయవలెను. జలుబుచేసే వస్తువులు లేని పథ్యం.

337 కస్తూరి మాత్రలు.

2 గురిగింజల యెత్తు కస్తూరి 4 గురిగింజల యెత్తు గోరోజనము 4 గు ఎత్తు పావుదార త్రియాచారం 0—0—6 ఎత్తు రసకర్పూరం రససిం దూరం కుంకుమపువ్వు పచ్చకర్పూరం చందనం త్రికటుకం త్రిఫలాలు శుద్ధిచేసిన యింగిలీకం ఇవి రకానికి 1 గ ఎత్తు సదాపాకు 0—0—6 ఎత్తు జున్ను 5 గురిజల యెత్తు బాగుగా నూరి ఆకుజెముడు కర్పూరవల్లి గుంటకలగరాకు పుల్లజెముడు కృష్ణతులసి రసములతో నూరి మాత్ర లయ్యే పాకమయ్యే సమయాన 1 గు ఎత్తు పునుగువేసి కలిపి మా త్రలు కట్టవలెను.

338 వాయుహార మాత్రలు.

వెర్రిపుచ్చకాయను ఎండబెట్టి, త్రికటుకం త్రిఫలాలు దినుసు కొక్కొక్క ఫలం చొప్పున వేసి కలిపినూరి నిమ్మకాయలు వావిలాకు రసముతో మర్దించి మాత్రలు కట్టుకోవలెను.

339 పచ్చసెగకు చూర్ణము.

కన్నెకుమారి 9 డబ్బుల ఎత్తు చూర్ణముచేసి యాలకులు 1 తు లవంగాలు తు1 నల్లజీలకర్ర తు1 జాపత్రి తు1 జాజికాయ తు1 పంచ దార ½ శేరు పైదినుసుల చూర్ణములో పంచదార కలిపి పూటకు తు4 చొప్పున 2 పూటలుగా 13 రోజులు సేవించేది ఇచ్ఛాపథ్యము.

340 జోగిరసము.

రసగంధకాలు వసనాభి పాముగరళము ఉబ్లిపాషాణం అభ్రకం వెలిగారం హారిదళం ఇంగిలీకం అతివస నిర్విషం గజపిప్పళ్లు వస మైల తుత్తం యష్టిమధుకం కటకరోహిణి దొడ్డిపాషాణం గౌరీపాషాణం గంటుభారంగి ఖండిమణిశిల రక్తమణిశిల సద్యక్షారం యవక్షారం వజ్జికారం సముద్రలవణం సైంధవలవణం సౌవర్చలవణం బిడాలవణం కాచలవణం శిలాజిత్తు కర్పూర శిలాజిత్తు తెల్ల జీలకర్ర నల్లజీలకర్ర

త్రికటుకం నేపాళాలు చిత్రమూలం ములగచెక్క పులిమిరిచెక్క వరగోగుచెక్క ఛాగకడ్డలు యాలకులు లవంగాలు ఆకుపత్రి పటిక సురేకారం విళంగం చంగల్వకోష్టు కర్కాటకశృంగి తక్కోలం జటామాంసి ముషిణివిత్తులు ఉక్కుభస్మము తామ్రభస్మము అయస్కాంతభస్మము నాగభస్మము స్వర్ణభస్మము రజితభస్మము కంచుభస్మము మౌక్తికభస్మము పగడభస్మము కెంపుభస్మం గోమేధికభస్మం పుష్యరాగభస్మం పచ్చలభస్మం వైడూర్యభస్మం వజ్రభస్మం మరకతభస్మం వీనిని సమభాగములుగా ఉంచుకొనవలెను. ఉమ్మెత్త అడ్డసరం చంద్రచెక్క ప్రత్తిఆకు ఆముదపాకు చిత్రమూలం దొండాకు పత్తిగురుపకారవేళ్ళు తుంగముస్తలు చిన్నములగ పెద్దములగ చిట్టాములగ పల్లేరు మాండూకబ్రహ్మి బోడసరం బ్రహ్మదండి దూలదాసురవేళ్లు మునగఆకు గుంటకలగరాకు విషముష్టిఆకు కేసరనల్లేరు గజ్జేరు నిమ్మపండ్లపులుసు జిల్లేడుపాలు కొండిసెచెక్క కాకరఆకు చేదుపొట్లతక్కెలఆకు వెదురాకు వావిలాకు చింతాకు గిలిగిచ్చ మర్రిపాలు రావిచెక్క జువ్విచెక్క వంగఆకు వేపయీనెలు దిరిసెనపుఆకు మామిడిచెక్క పొన్నపువ్వు పనసఆకు పొగడఆకు రేలాకు కలిగొట్టవేర్ళ్ళు రేగాకు దాక్షపళ్ళరసము త్యాగవేర్ళ్ళు పేంఖణపు పువ్వు గురివిందపువ్వు మల్లెపువ్వు మొల్లపువ్వు దుష్టపు ఆకు బలుసుకూర కలఖంద సర్పాక్షి ఆరెపువ్వు వెలమసంధి పులిమిరి ఉత్తరేణిఆకు ఉసిరికపప్పు నేలవుసిరికె తాడికాయలు కరక్కాయలు చెముడుబాలు పిల్లిపిసరవేళ్లు గొలిమిడిఆకు నల్లగొలిమిడిఆకు బూరుగువేళ్లు మోదుగుచెక్క మరాటిమొగ్గలు పిన్నముత్తువపులగము పెద్దముత్తువపులగము చిట్టిపొట్లవిత్తులు విష్ణుక్రాంత రేగడిదూల యీతాకు టెంకాయనీళ్లు అరటిదుంప తాటియాకు తుమ్మికవేళ్ళచెక్క తామరాకు కలువదుంప వట్టివేళ్ళు నాచురసం కురువేర్ళ్ళు పులవ ఆకు మినపఆకు సెనగఆకు నల్ల

గజ్జేరు తెల్లవుప్పివేళ్ళు పెన్నేరుగడ్డలు నేలగుమ్మడిగడ్డలు నేలతంగే డాకు దింతినవేళ్ళు గానుగవేళ్ళు జీడినూనె గొల్లజీడాకురసం బిళ్ళా కురసం పొన్నగంటికూర చాతరాసిఆకు చక్రవర్తిఆకు కొత్తిమీర చామాకు అడివికంద నారదబ్బపండ్ల పులుసు దబ్బపండ్లపులుసువావి లికూర గుమ్మడిపంటిరసము వీనిరసములుపోసి మర్దించిన పిత్తులుగల్గిన చెట్లవిత్తులతైలములు తీసిపోసి మర్దనాచేసి ఒక్కొక్క తైలమునఒక్కో కరోజు మర్దనాచేసిన తరువాత దానిని గాజుకుప్పెలోవుంచి చీరమన్ను లిచ్చి వాలుకాయంత్రమున మందాగ్నియందు ఒకదినము ఉత్తమాగ్ని యందు ఒకదినమువండి సాంగశీతలానగురిచ్చి ఖల్వమునందుంచుకొని దానియందు నెమలి బల్లి కుక్క నక్క ఎనుచోతు తొండ తోడేలు జింక పులి ఏనుగు యెలుగు గుఱ్ఱం గాడిద మీను మేక అడవిమనిషి కోడి పాము ఎలుక ఊసరవిల్లి గద్ద కాకి పిచ్చుక గువ్వ బబ్బులుగు ఎద్దు కుందేలు కోతి కొంగ కప్ప గ్రద్ద గోరువంక లకుముకి గబ్బిలము యేట్రింత కోవెల పైడికంటె పాలపిట్ట చిలుక చాతకము పాలపిట్ట తేలు చిలుక మొదలగు జలచర భూచరములగు జంతు పక్షి జాతుల న్నింటి చేదుకట్లను తీసి మొసలి చోర అలుగు నీటిపాము ఆరికిపీత మొదలగువాని పైత్యములుపోసి మర్దనాచేసి తయారుచేసినఔషధము పెసరగింజంత కర్పూరము అనుపానముతో సూదిమొనకు వచ్చినంత మందును సేవించినచో ఏరోగమైనను మానును, నూనెతో అభ్యం జనముచేయవలెను. పెరుగు వంటకం పథ్యము. కర్పూరం శ్రీగంధం వట్టివేళ్ళున్నూ మర్దనాచేసి శరీరముపై ఆరగా ఆరగా పూయుచు కొబ్బరినీళ్లు దాహమునకు పుచ్చుకోవలెను. అదికానిచో పానకమైనను యీయవచ్చును. చెరుకుముక్కలుతినిపించవలెను. ఈ శ్రేష్ఠమైనయో గము చింతామణిలోనిది.

## 341 తలవెండ్రుకలు ఊడకుండుటకు.

ఆవుపాలు 2కుంచములు గేదెపాలు 1కుంచెడు కలిపి బాగుగా మరగనిచ్చి 4 పాళ్ళు ఊడుగవిత్తుల పొడుమును1పాలు చిత్రమూలపు వేళ్ళపొడుమును ఆకాగినపాలలోపోసి తోడుపెట్టి మరుసటినాడు పెరుగును తరచగా వెళ్ళిన వెన్నకాచి ఆనెయ్యి 1½దినములు తలఅంటుకొని నువ్వులపిండితోగాని ఉసిరికపిండితోగాని తలకడుగుకొనిన ఊడిపోయిన వెండ్రుకలుమరల మొలిచిఊడిపోవనున్న కేశములనుగట్టిపరచును.

## 342 స్వచ్ఛందభైరవరసము.

రసం నాభి గంధకం జాజికాయ ఒక్కొక్కటి ఒక్కొకతులం చేర్చి వీనికి సమానముగా పిప్పలిచేర్చి ఖజ్జలిగా మర్దనాచేసి ధాన్యపుటమునందు 3 మండలములుంచి 2 గురిజలంత అల్లపురసముతోనైనను తమలపాకులరసముతోనైనను శొంఠి జీలకర్రలతోనైనను ఈయవలెను.

## 343 (1) సిందూరయోగము.

3 గ గంధకం 3గ స్వర్ణభస్మం ౧గ తామ్రభస్మం ౨ గ మణిశిల ౨గ తాళకం వీనిని శుద్ధిచేసి ఒకటిగానూరి పచ్చగవ్వలలోపోసి, దానిమీద మేకపాలు వెలిగారంపోసి మెత్తగానూరి ఎండబెట్టి ముంతలోనుంచి పెంకుమూసి చీరమన్నులిచ్చి పుటంపెట్టి తీసి గవ్వలతోకూడనూరుకోవలెను.

## 343 (2) సిందూరయోగము.

రసగంధకాలు చెరివకపాలు నిమ్మపండ్లరసముతోను కలబందరసముతోను చిత్రమూలపు రసముతోను తులసిఆకు రసముతోను త్రిఫలాలరసముతోను తేనెతోను హంసపాదిఆకు రసముతోను సహదేవిఆకు రసముతోను పారిభద్ర రసముతోను గోరంటాకు రసము

తోను భావనచేసి నీడను ఎండబెట్టి గాజుకుప్పెలోబోసి కొకమన్నులి చ్చి వాలుకాయంత్రమున కుప్పెబెట్టి మూకుడు పైనమూతవేసి యం త్రించి పొయ్యిమీదదీపాగ్నిని 3 దినములువండి సాంగశీతలానగ్రుచ్చి న ఇంద్రగోపచ్ఛాయగానుండును.

344 కఠినవ్యాధి హరమాత్రలు.

శంఖుపాషాణమును సహదేవి ఆకుపసరున 7 దినములు ప్రతిదినం ఉదయంనూరి సాయంత్రంవఱకు ఎండనిచ్చి మరుసటిరోజు తిరిగి ఆప సరుతోనే నూరవలెను. 8వ దినమునను ఆపసరు చేతనే మర్దించి పెస రగింజకన్న చిన్నమాత్రలు చేసేది. అనుపానం చనుబాలుగాని తేనె గాని వాడవలెను. పులుసు మద్యం గంజి అన్నం తినవలెను.

345 పార్శ్వవాయువులకు మాత్రలు.

కరక్కాయపొడుమును వస్త్రగాళితంచేసి ఆపొడి 14 తులాలు న్నూ వస్త్రగాళితంచేసిన శొంఠిపొడి 1 తులముఎత్తున్నూ మిరియాల పొడి 1 తులంఎత్తున్నూ వేడిచేసిన పిప్పళ్లు 1 తులం ఎత్తున్నూ ఆవాలు 1 తులం చిత్రమూలం 1 తులం సురేకారం 1 తులం బెల్లం 1 తులం వామం 0-2-0 ఎత్తు పాపటకాయ గోపలిగుంజు 1 తులం ముసాంబ్రం రెండుతులాలన్నర వొలిచిన తెల్లపాయలు 20 న్ని కొద్ది గా నూనె బెల్లము యీవస్తువులను ఖల్వములో మెత్తగానూరి బెల్ల పునీళ్లను అందులో పోయుచు మాత్ర అయ్యేపర్యంతం మర్దించి పెద్ద సెనగగింజలంతేసి మాత్రలు చేయవలెను.

పథ్యం—పులుసు—మద్యం.

జలుబు వాయువు వస్తువులు కూడదు.

అనుపానం—కృష్ణతులసి మిరియాలు నూరి ఆ రసంతోగాని కృష్ణతులసిముద్దతోగాని పుచ్చుకోవలెను.

### 346 అప్పటం కస్తూరిమాత్రలు.

జున్ను కస్తూరి గోరోజనం పావుదారు దినుసునకు 4 గురిజల ఎత్తుకుంకుమపువ్వు పచ్చకర్పూరం చందనందినుసునకు 2 గురిజలఎత్తు త్రియాచారం అర్థణాయెత్తు సదాపాకు అర్థణాయెత్తు పై రసములలో మర్దించి పుటంవేసి మాత్రలు కట్టుకోవలెను.

### 347 గోక్షీరాదిమాత్రలు.

16 పలములనీళ్ళలో 28 పలముల సమూలమైన పల్లేరువేసి చెరిసగం ఇగురునట్లు కాగనిచ్చి కాచి వడకట్టి అందులో 2 పలముల గుగ్గిలము పొడుమువేసి గుడపాకము వచ్చుదనుక కాగనిచ్చి త్రిఫలాలు త్రికటుకములు తుంగముస్తెలు జాతికి 1 ఫలముచొప్పున చూర్ణముచేసి కలిపి కుంకుడుకాయంత మాత్రలుగా కట్టి సేవించేది. ఇది సేవించినందువలన బహుమూత్రము మూత్రకృచ్ఛ్రము మూత్రఘాతము వాతరక్తము వాతరోగములు శుక్లదోషములు శాంతించును. ఇవి 40 దినములు రోజుకు 2 పూటల చొప్పున పూటకొక మాత్రగా సేవించవలెను.

### 348 నంజు వాపు రసపట్లకు కీళ్ళనొప్పులకు మాత్రలు

బాగుగా పుటములు పడ్డ కటారిలోహం 1 తులం రసకర్పూరం 1 తులం పిప్పళ్లు ½ తులం తమలపాకులరసముతో మర్దనాచేసి కుంకుడుగింజంత మాత్రలు పూటకు 3 చొప్పున 2 పూటలున్ను 3 దినములు సేవించవలెను. మాత్రను తేనెలోముంచి అంగుటిలోపలికి వేసుకొనేది. అట్లగానిచో మాత్రలను పిప్పళ్ళు తమలపాకురసముతో మెత్తగానూరి ఆరబెట్టి సేవింపవచ్చును. మాత్రలు వేసికొన్నతోడనే పదితమలపాకులు కరక్కాయపేడుతో నమలి మ్రింగవలెను. ఈవిధముగా ప్రతిపూటా చేయవలెను. వీనివలన 1, 2 విరేచనములగును. పథ్యం కందిపప్పుకట్టు కందిపప్పు చింతపొట్టు ధనియాలకారము ఆవు చల్ల ప్రాతచింతకాయపచ్చడి మొ॥

349 అజీర్ణకిమాత్రలు.

మిరియాలు వాము సుగండశాల్సు రసకర్పూరం సమభాగాలు గుంటకన్నాకురసాన మర్దించి గురుగింజంత మాత్రలుచేయవలెను.

350 వాయుహరభేది మాత్రలు.

రసం నాభి గంధకం వెలిగారం శొంఠి పిప్పలి తాళకం మిరియాలు తాడికాయలు ఉసిరికపప్పు ఇవి సమపాళ్ళు నేపాళాలు 8 పాళ్లు నిమ్మకాయరసాన మర్దించి మాత్రలు కట్టవలెను.

351 ఉబ్బసమునకు.

బెల్లమును తెల్లజిల్లేడు పూవులోవుంచి నూరి చిన్నగచ్చకాయంత మాత్రలుచేసి 7 పూటలు యివ్వవలెను.

352 వాంతిని నిలుపుటకు.

జిల్లేడుపూతతో నల్లమందును నూరి కుంకుడుగింజంత మాత్ర చేసి సేవించవలెను.

353 మదనకామేశ్వర రసము.

ఉల్లి గుంటగలగర గంజాయి లింగపొట్ల పైడి ఉమ్మెత్త వీనివిత్తనములును ఏలకులు జాజికాయలు చంగల్వకోష్టు జాపత్రియును చూర్ణముగానూరి వీనిలో 1 భాగమెత్తు కర్పూరము వేయవలెను. వీనిని కొబ్బరికాయ నీళ్ళుపారబోసి కాయలోపోసి పుటంవేసి చల్లార్చి తీసి కొబ్బరినీటితోనూరి పోకలంతంత గుళికలుగాజేసి ఒక్కొక్కగుళిక చొప్పున సేవించవలెను.

354 తిప్పసత్తు తీసేక్రమము.

తిప్పతీగపైనుండు బెరడుతీసివేసి బెత్తెడుముక్కలుగా ఖండించి రోటదంచి బానలో చన్నీటవేసి కలిపి పిశిచి పిప్పిని తీసివేసి యింకొక బానలో వడియకట్టవలెను. అది తేరుకొన్న పిదప నీళ్ళువొడుస్తూవచ్చిన మొదల అడుగున తెల్లనిసత్తు నిలుచును. దానిలోకలిబోసికలి

సి తేరనిచ్చి వడియకట్టవలెను. అడుగున తేరిన తిప్పసత్తునుమూకుట్లో ఉంచి ఎండబెట్టవలెను. పిమ్మట ఆకుపత్రికం చంగల్వకోష్టు గంధి కూరవేళ్ళు దినిశపప్పు కుంకుమపువ్వు నాగకేసరాలు ద్రాక్షపండ్లు యాలకులు కర్పూరం శ్రీగంధం చందనం శిలాజిత్తు త్రికటుకం యష్టిమధుకం పెన్నేరుదుంప పిల్లిపీసర నేలగుమ్మడి పచ్చైరువేళ్ళు కర్కాటకసన్నిజాజికాయలు తక్కోలపుట్లు కచ్చూరాలు వీనిని కర్షప్రమాణాల చొప్పుననూ దీనికి రెట్టింపు తిప్పసత్తు పెట్టి చూర్ణమునూరి తేనె శర్కర ఆవునేతులలో దేనితోనైనను సేవించినచో గుణమిచ్చును.

### 355 మదనకామేశ్వరము.

యాలకులు లవంగాలు ఆకుపత్రి నాగకేసరాలు ద్రాక్షపండ్లు చంగల్వకోష్టు కచ్చూరాలు సదాపవిత్తులు యష్టిమధుకం జాపత్రి ఖర్జూరపుపండ్లు దూలగొండిగింజలు తిప్పసత్తు పిల్లిపీసరవేళ్ళు నేలతాడిదుంపలు పెన్నేరుదుంపలు ఉత్తరేణిగింజలు, నేలగుమ్మడిదుంపలు సముద్రపాలగింజలు త్రికటుకాలు చారపప్పు రాస్నమొంతులు జాజికాయలు అక్కలకర్ర వాయువిడంగాలు చిఱుకు వెలగవేళ్ళు చిత్రమూలపువేళ్ళు బూరుగుబంక అభ్రకం తక్కోలపుపొట్ట దామెరదుంప కుంకుమపువ్వు నల్లజీలకర్ర గంటుభారంగి జీడిపలుకులు కొడిసెపాలు ముత్తునపులగపువేళ్ళు భూచక్కెరదుంప పచ్చిపులుసుతాటిగుంజు ఉసిరికపప్పు సుగంధిపాలవేళ్ళు కస్తూరి పేంఖణపువ్వు వెదురుబియ్యము గుంటగలగరగింజలు గొబ్బిగింజలు పెద్దముత్తువపులగంవేళ్ళు పిన్నముత్తువపులగంవేళ్ళు తెల్లనువ్వులు బొబ్బరలు మినుములు సమానభాగాలుగాచేర్చి చూర్ణముగావించి దానికి సమముగా గంజాయిచూర్ణముచేర్చి కొబ్బరినీళ్లతో ఖల్వాన 7 దినములు భావనచేసేది. తరువాత 2 దినములు అరటిదుంపరసముతోను 3 దినములు పిల్లిపీసరవేళ్లరసముతోను 1 దినం పన్నీటితోను భావనచేసి

ఎండించి ఎండినచూర్ణమునకు సమముగా శర్కరపెట్టి లేతపాకానికి రానిచ్చి చూర్ణము కలిపి దించి దొండకాయలంతమాత్రలు తేనతో సాయంత్రములందు సేవించి మధురాహారములు తినవలెను.

### 356 బాలసూర్యోదయము.

నాభి రసం గంధకం 3 పాళ్ళున్ను తామ్ర లోహభస్మాలు 2 పాళ్ళున్ను గవ్వలభస్మం 4 పాళ్ళున్ను అభ్రభస్మం 7 పాళ్ళున్నుకలిపి వీనికి సమముగా మిరియాలు వేయవలెను. దానినిశొంఠికషాయము తోను చిత్రమూలపురసముతోను తమలపాకులరసముతోను ఖల్వమున 3 దినములు మర్దించి పిదప సీసెను ఆరనిచ్చి మూకుటమూసి చీరమన్ను లిచ్చి సన్నమంటలో పుటంవేసేది. దింపి చల్లార్చి ఆ ఔషధమును తిరి గి చిత్రమూలపురసమున నూరి పూటకు అడ్డిగ చొప్పునసేవించినచో జ్వరాలు శ్వాసలు వాంతులు దగ్గులు శూలలు పాండురోగములు మూలశంకలు మేహములు హృదయవ్యాధులు ప్లీహవ్యాధులు గుల్మ వ్యాధులు క్షయలు యోనిరోగములు పీనసలు మందాగ్ని అరుచి శ్లేష్మవ్యాధులు లింగదోషములు మూత్రకృచ్ఛ్రలు మున్నగు రోగ ములు అనుపాన భేదములచే శాంతినందును.

### 357 శీతాంశురస మాత్రలు.

తాళకం మణిశిల శొంఠి ఒక్కొకతులమున్ను మిరియాలు 2 తులములున్నూ చూర్ణముచేసి 3 దినములు నిమ్మపండురసముతోమర్ద నాచేసి సెనగగింజలంతమాత్రలు కట్టి ధనియాలరసం తేనె అల్లపు రసం ఉష్ణోదకాల అనుపానముతో సేవించవలెను. ఇందువలన పైత్య జ్వరములు శీతపైత్యములు పైత్యవాతములు హరించును.

ఈమందును నిమ్మపులుసుతోనైనను నీళ్ళతోనైనను చాది కంటికి వేసినయెడల సకలశిరోవ్యధలు హరించును. ఇది బహుశ్రేష్ఠ మైన కలికము.

### 358 పైత్యాంతకము.

లవంగాలు యాలక్కాయలు జీలకర్ర ధనియాలు జాపత్రి నిమ్మతోలు తెల్లచక్కెర వీనిని దినుసుకొక పలము చొప్పున తేనెలో మర్దించి పెద్దసెనగగింజంత మాత్రలు కట్టి సేవించేది.

### 359 జోగిరస సంజీవసుఖమాత్రలు.

రసం నాభి అమరశిలగంధకం వెలిగారం తాళకం త్రికటుకాలు తాడికాయ ఉసిరికపప్పు సేవాళాలు ఒక్కొక తులం గుంటకలగరాకు రసాన మర్దించి గురుజప్రమాణం మాత్రలు కట్టుకోవలెను.

### 360 చచ్చు తిమ్మిరులకు మాత్రలు

త్రికటుకాలు సైంధవ సౌవర్చలవణాలు నల్లజీలకర్ర ఇంగువ సమముగాచేర్చి తెలగపిండిలో బఠాణీలంత మాత్రలుచేసికొనవలెను.

### 361 [illegible]మాత్రలు.

ఇంగిలీకం 1తు జాపత్రి 2తు [illegible] గింజలు 3తు నల్లమందు 5తు [illegible] 7తు [illegible] 4 జాములు నూరి మిరియపుప్రమాణం మాత్రలు చేసుకొనవలెను.

అనుపానము ఆవుపాలుగాని శక్కరగాని పంచదారగాని అనుపానముచేసి రాత్రిపూట 1 మాత్ర యివ్వవలెను. [illegible]యు వీర్యవృద్ధియగును.

### 362 బాలుర సర్వ[illegible]కు మాత్రలు.

హాటకధ్వంసి [illegible]రసం శీతాంశురసం [illegible]రసం సన్నిపాతజ్వరాంకుశం ఇవి కావలసినంత సమభాగాలుచేర్చి దానిలో కొంచెము గరళముచేర్చి గుంటగలగరాకు రసాన మర్దించి పెసరగింజ ప్రమాణం మాత్రలు చేసుకొనవలెను. సమయోచితానుపానాలతో [illegible] యివ్వవచ్చును. పిల్లలకుకూడా ఉపయోగించును.

### 363 సర్వవిధరోగములకు నొప్పులకు.

గొడ్డుశియును నాభియును 3 రోజులకాలం గోమూత్రముతో కొత్తకొత్తగాపోసి ఊరినతరువాత నాభినివేరుగా తీసివేసి దానిని ముద్దార్శింగుతో సమభాగంగావేసి మిరియాలు ముడిలవంగాలు 2 పాళ్లు వేసియుంచి నిమ్మరసంతోనూరి మాత్రలుచేయవలెను. దీనికి పులుసు తగులకూడదు.

### 364 పరిమళ మాత్రలు.

యాలక్కాయలు లవంగాలు చలవమిరియాలు జాజికాయలు జాపత్రి తెల్లకాచు వట్టివేరు సుగంధిపాలవేళ్లు వలుపు అక్కలకర్ర మునాశిబుడ్డ కచూరపచ్చ యినుసుకు 1 పలము వొప్పున పచ్చకర్పూరం కస్తూరిపూసు యినుసుకు పావలాయెత్తు కలిపి నూరి వస్త్రగాళితం పన్నీరు పన్నీటు పుట్నాలేసి మాత్రచేసి నీడను ఆరబెట్టవలెను. ఈమాత్రలు తాంబూలముతో వాడవచ్చును.

### 366 భేదిమాత్రలు.

కొండ ఆముదపుగింజలు బాగుగానూరి పెసరగింజ ప్రమాణపు మాత్రలు చేసేది భేదివిశేషముగా నైనపిదప బియ్యం పప్పుకలసిన పులగం యిచ్చేది. ఇచ్ఛాపథ్యము

### 366 భేదినుంచు మాత్రలు.

8 పాళ్ళునేపాళాలు 3 పాళ్ళుశొంఠి 1 పాలుమిరియాలు1 పాలు వెలిగారం 1 పాలురసం 2 పాళ్లు గంధకం శొంఠి ఉపరసంతో నూరి గురిగింజప్రమాణం మాత్రలు చేసుకొనవలెను. ఇ పకు పులుసు మధ్యము కుప్పింటాకు మిరియాలు తెల్లపాయలు నూరి చింతగింజలంత మాత్రలు ఇచ్చినయెడల భేది చక్కగా అగును. విశేషభేదులయినచో పెరుగు అన్నం పెట్టవలెను.

367 ఇంకొక విధము.

½ పనేపాళపుగింజలు 5 ఖర్జూరపుపండ్లు తెచ్చిలోపలనున్న గుంజుతీసివేసి పండు 1 కి 2 -3 నేపాళపు గింజలుచొప్పున వుంచిదారముతో కట్టి తేనె గరిటిలో వేసి బాగా ఉడుకనిచ్చి నూరి మాత్రలు చేసి పూటకొక్క మాత్రవాడుచు చారు అన్నం పెట్టవలెను.

368 కాళింగాదిభేదిమాత్రలు.

ఎండబెట్టిన వెర్రిపుచ్చకాయ పన్నీరుపువ్వు యిందుప్పు రకమునకు 2 పలములు చొప్పున శొంఠి పిప్పళ్లు మిరియాలు త్రిఫలాలు రకమునకు 1 ఫలముచొప్పున చేర్చి నిమ్మరసములో మర్దనాచేసి మాత్రలు కట్టవలెను.

369 అన్ని వాయువులకు చల్దులకు ధృతి.

కృష్ణాభ్రకపురాయియున్నూ గంధకమున్నూ నూరికలిపి వత్తులుగాచేసి ఆవునేతితో నాననిచ్చి పట్టుకారుతో పట్టి దీపముముట్టించి పళ్ళెము క్రింద వుంచవలెను. మిగతనెయ్యి విసర్జించి పళ్ళెమున వడిపిననెయ్యిమాత్రము సీసాలోవుంచుకొని తమలపాకుల తొడిమలరసములో పూట 1 కి 3 బొట్లుగా 20 రోజుల వరకూ యివ్వవలెను. ఇచ్ఛాపథ్యము.

370 గండమాలాబంధన రసమాత్రలు.

శుద్ధమైన రసం 1 తులం గంధకం ½ తులం తామ్రభస్మం ౧½ తులం మాండూరం 3 తులాలు శొంఠి 2 తులాలు పిప్పళ్లు మిరియాలు 2 తులాలు సైంధవలవణము 1 తు దేవకాంచనపుచెక్కపొడుము 3 పలాలు శుద్ధమైన మైసాక్షి గుగ్గిలము 3 పలాలు వీనిని ఖల్వములో ఏకముగానూరి ఆవునేతితో మర్దనాచేసి 3 మాషముల ఎత్తు మాత్రలు కట్టేది. ఇవి సేవించినయెడల అసాధ్యగళగండములు గండమాలలు శాంతినందును.

### 371 వజ్రిమోదుమాత్రలు.

త్రికటుకాలు తెల్లగలిజవేరు తెగడ వాయువిళంగాలు దేవదారు పసుపు చెంగల్వకోష్టు మానిపసుపు చిత్రమూలము త్రిఫలాలు దంతిమూలములు చవ్యము కొడిశపాల కటకరోహిణి మోజ తుంగముస్తెలు కరకపుప్వ నల్లజీలకర్ర వాము కాయఫలములు దినుసు 1కి ఒకపలము చొప్పునవేసి నూరి 8 రెట్లు గోమూత్రించేర్చి గురుపాకంగా వండి కుంకుడుగింజలంత మాత్రలుచేసి మజ్జిగతోనైనను తేనెతోనైనను సేవించేది.

### 372 వీర్యవృద్ధికి.

యష్టిమధుకం తేనె నెయ్యి కలిపి మండలంరోజులు పుచ్చుకోవలెను. ఆవుపాలు త్రాగవలెను.

### 373 కామములేనివారికిమందు.

తొత్తడివేరు 7 మిరియాలు పిన్నసుగంధివేరు కలిపినూరి 7 దినములు గచ్చకాయంతమాత్ర సేవించవలెను.

### 374 పైదానికే ఇంకొకప్రక్రియ,

చవ్యా ఆకుపత్రికం తవాక్షీరి ద్రాక్ష పెన్నేరు నారుమంపలు సుగంధివేళ్లు యష్టిమధుకం కర్కాటకశృంగి తామర అగరు పుక్కిటవిత్తులు ఖర్జూరం రెండేసి మాడలు ప్రత్యేకముగా పిప్పలిపొడి ౨ పళొంఠి ౨ పలముల చూర్ణముచేసి లోహమున కలిపి ౮ పలాల తేనె అందులోకలిపి లేహపాకమైన పిదప ధాన్యపు పాకమున 3 రోజులు ఉంచి ప్రతిదినము పుచ్చుకొనుచు ఆకు పులుసు వర్జించి మధుర పదార్థములు తినుచుండవలెను.

## 375 ఇంద్రియపుష్టికిమాత్రలు.

పై బెరడు తీసివేసి తొర్రలుచేసిన 10 జాజికాయలలో 1 తులం ఎత్తు నల్లమందువుంచి వేపచెట్టు తొరటలో పూడ్చి 10 దినములుఉంచి సేరుపాలలో ఈకాయలను తంగేడుకట్టెతో పాలు ఇనుకునట్లు ఉడక బెట్టి దానినినూరి పెసరగింజలంత మాత్రలు కట్టుకోవలెను. వేడి వస్తువులు వర్జించవలెను. నేయి పాలు వెన్న గసగసాలు బాదంకాయలు చక్కెర ఇట్టివి ఎన్నివాడిన అంతవిశేషము.

## 376 చెకిడి జాడ్యమునకు మాత్రలు.

శొంఠి దుంపరాష్ట్రము వాము మిరియాలు దినుసునకు తు ½ న్నూ గంగరేగుచెక్క 3 ఫలాలు బెల్లం [illegible] ఫలాలున్నూ చూర్ణము చేసి బెల్లం కలిపి [illegible] కొంచెము కలిపి గచ్చకాయలంత చేసి మాత్రలు కట్టుకోవలెను, [illegible].

## 377 అతిసారము వెలుపలకు [illegible].

[illegible] కొబ్బరినూనెలో కలిపి 2, 3 రోజులు రాయవలెను.

## 378 [illegible]

గొబ్బిగింజలు [illegible] దూలగొండి వేళ్ళతాడి పిప్పితేగలు బూరుగబంక [illegible] అశ్వగంధితో కలిపి సేవించిన పిదప అరసోలెడు ఆవుపాలుత్రాగవలెను.

## 379 శనగలస్తంభన.

[illegible] వేసి తెల్లవారగట్ట సన్నగ [illegible] వేయించవలెను. నిరువడసపోవును. ఆవునేతితో శుద్ధిచేసిన తేనె [illegible] కలిపి మండలము వాడినచో సంభోగశక్తి అతిశయించును.

### 380 స్తంభనమాత్రలు.

కుంకుమపువ్వు జాపత్రి జాజికాయ లవంగాలు అక్కలకర్ర మోదుగుబంక బూరుగుబంక గోరింటగింజలు వీనిని సమముగాచూర్ణము చేసి ఆమీద పన్నీరుపోసి నూర్చింది శనగగింజలంత మాత్రలుచేసి భోజనపూర్వం 1మాత్రచొప్పున సేవించవలెను. నిమ్మరసం విరుగుడు.

### 381 శుక్ల స్తంభనకు.

పల్లేరు మునిగోబ్బి దూలగొండి వీనివిత్తులున్నూ మిరియాలు నేలతాడిదుంప పిల్లితేగదుంపలు సమానభాగాలు మర్దనాచేసి పాలతో సేవించవలెను.

### 382 వీర్యవృద్ధికి.

సమగ్గిపాయలు తెల్లగలిజేరు కుమ్ముబెట్టి నెయ్యి శర్కర పెరుగు [illegible] 7 దినములు సేవించవలెను. మరియును రెడ్డివారి నానబాలాకు పసుపుతో పిప్పిచేసి 1 [illegible] నానబెట్టి ఎండించవలెను. ఈరీతిగా ఏడుపుటలుచేసి పిదప చూర్ణించిపంచదారతో సేవించవలెను. నేయి ముఖ్యముగా వేసి.

### 383 బీజబంధు.

రామములగగింజలు లవంగాలు నల్లమందు కుంకుమపువ్వు జాజికాయ సమాన భాగాలు ఆవునేతితో మర్దనాచేసి సెనగగింజలంత మాత్ర భోజనానంతరం సేవించి పాలుతాగవలెను దీనికి నిమ్మరసం [illegible].

### 384 పెన్నేరు లేహము.

త్రికటుకాలు యాలకులు లవంగాలు సువర్ణరాష్ట్రం కళింగరాష్ట్రం అక్కలకర్ర తాలిసపత్రి తాడికాయలు తవాక్షీరి భూచక్రగడ్డ పెన్నేరు కన్నెకోమలి పాలసుగంధి నేలతాడి పటికిబెల్లం ద్రాక్షపండ్లు తేనె ఆవునెయ్యి ఇవి తూగినంతఎత్తు పెన్నేరుదుంప పెట్టి చూర్ణము

చేసి వస్త్రగాళితంచేసి చెరుకుబెల్లం తగినంతవేసి పాకముబట్టి చూర్ణ ములందులోవేసి లేహ్యంతయారుచేసి దానినొక నెలరోజులు ధాన్యపు టమందుంచవలెను. పిమ్మటతీసి ఉసిరికాయప్రమాణం సేవించేది. ధాతుపుష్టి వీర్యవృద్ధికల్గును, జ్వరాలునిశ్శేషమగును, శ్వాసలుమా నును. ఇచ్ఛాపథ్యము నేయి మజ్జిగ వాడవలెను.

---

# ముఖరోగచికిత్స.

### 385 పచ్చసెగమాత్రలు.

1వ విధము:—గారవేళ్ళరసము 3 తులాలు పంచదార 3 తు లాలుకలిపి చప్పిడి పథ్యము పెడుతూ 5 పూటలు యివ్వవలెను.

2వ విధము:—లవంగాలు యాలకాయలు చలవమిరియాలు కాచు ఉసిరికపప్పు దాల్చినిచక్క మరాటిమొగ్గలు కర్పూరము చీనా పంచదార సమభాగాలుగా కలబందగుంజు గుడ్డలోవేసి పిండినరసము తో కుంకుడుగింజలంత మాత్రలుకట్టి ఇచ్ఛాపథ్యముగా రెండుపూ టలచొప్పున 15 రోజులు వాడవలెను. మామిడికాయ అరటికాయ పనసకాయ పనసపండు కంద పాలు పెరుగు ఇవిగాక చీముపట్టు పప్పు దినుసులు వర్జములు.

3వ విధము:—త్రికటుకాలు చూర్ణించి దీనికి సమముగాగుప్పి కొమ్ముచూర్ణముకలిపి తాటిబెల్లపు పాకముతోకలిపి గచ్చకాయంత మాత్రలు కట్టి 5 పూటలు సేవించవలెను.

4వ విధము:— రేవలచిన్ని చలవమిరియాలు కాల్చినవసనెలం జీరా కరక్కాయచెక్కలు తాటికలకండ సురేకార భస్మము ఒక్కొక

టిమూడేసి తులాలున్నూ చందినీఅత్తరు 6 తులాలున్నూ మర్దనాచేసి పూట1కి 2 మాత్రలచొప్పున 15 దినములు ఇచ్ఛాపథ్యముగా సేవించేది.

5వ విధము:—సమూలంగుంటకన్నాకుతో 9 మిరియములు నూరి కుంకుడుగింజలంత మాత్రలుకట్టి 3 రోజులు ఉదయం సేవించవలెను. వేడినీళ్ళు అన్నంపథ్యము.

6వ విధము:—బలరక్కసి వేళ్ళరసములో తగినంత చీనాపంచదారకలిపి సేవించేది. కఠినపథ్యం.

7వ విధము:—కలబందగుంజు లవంగాలు జాజికాయ త్రికటుకాలు సమాంశాలునూరి సేవించవలెను.

8వ విధము:—రత్నపురుష మిరియాలు 9కిసమానముగానూరి ఉదయం పావలాఎత్తు సేవించవలెను.

9వ విధము:—తేనె గవ్వలభస్మకు పావలాఎత్తు 5 పూటలు చీనాపంచదారతో సేవించవలెను.

10వ విధము:—తెల్లఉప్పివేళ్లు చిత్రిమూలము నల్లజీడిగింజలు మిరియాలు రకానికి 1 తులంచొప్పున పిడికెడు ఉత్తరేణిచిగుళ్ళతో నూరి గచ్చకాయంతమాత్రిలు 3 మాత్రిలుచొప్పున 3రోజులుఇచ్ఛాపథ్యముగా సేవించేది.

11వ విధము:—5 మిరియాలువేసి గిలిగిచ్చవేరునూరి గచ్చకాయప్రిమాణం మాత్రలుగాకట్టి పంచదారలోపొదిపి పగటివేళలందు 5 రోజులు యివ్వవలెను. సాయంత్రములందు మోతాదుతగ్గించవలెను. ఇచ్ఛాపథ్యము.

12వ విధము:—11 యాలకులు మిరియాలు నేలతంగేడునూరి యిండుపకాయలంత మాత్రలుకట్టి పూటకు 2 చొప్పున 9 దినములు ఇచ్ఛాపథ్యాన సేవించేది.

13వ విధము:—యాలకులు 4తు దాల్చినిచెక్క 4తు నల్లజీల కర్ర 4 తు జాపత్రి 1 తు పంచదార 1 తు చూర్ణముచేసి గుంటకల గరాకు రసాన మర్దించి శనగగింజలంతమాత్రలు ఇచ్ఛాపథ్యముతో 2 మాత్రలప్రకారం 15 దినములు 2 పూటలున్ను పుచ్చుకోవలెను.

14వ విధము:—5 తులాల నేలతంగేడాకు 2తులాల సురే కారం 2 పూటలవంతున 3 దినములు సేవించేది.

15 వ విధము:—గచ్చకాయ 1 భాగం పటిక 2 భాగాలు దాల్చినిచెక్క 2 భాగములు మిరియాలు 1 భాగం జాజికాయ 4 భా గాలు సహముగా చంద్రకాంతరసంగవేసి నీళ్ళలో మర్దించి పూటకు కరక్కాయప్రమాణం 2 పూటలవంతున 15 దినములు సేవించేది. పథ్యము ఆవునేయి ఆవుమజ్జిగ కందికట్టు కందిపప్పు.

16 వ విధము:—జాజికాయలు తు 4 పిల్లితేగలరసము తు 1 అరటిదుంపరసము పావుసేరు జీలకర్ర 4 పంచదార 3 తులాలు నూరి మూడుపూటలు పెసరపప్పు గేదెపెరుగు పథ్యంతో పుచ్చుకోవలెను.

17 వ విధము:—ఏబదేండ్ల మామిడిచెక్కరసం 2 తు సున్న పుతేట 1 తు చేదుజీలకర్ర 4తు కలిపి 3 పూటలు ఇచ్ఛాపథ్యాన సే వించేది.

18 వ విధము:—కన్నెములగరసం మిరియాలపొడుము పంచ దార కలిపి 5 పూటలు సేవించేది. పథ్యంలేదు.

19 వ విధము:—ఏనుగపల్లేరు సమూలం పిడతలో తవ్వెడు నీళ్ళుపోసి చెట్టును తలక్రిందుగా మణిగేటట్టు వుంచి పైన బండపెట్టి ఒక రాత్రివుంచి వుదయం చెట్టునుతీసి దులిపి పైనురుగుతీసివేసి యాల కులు లవంగాలు దాల్చినచెక్క పంచదారచూర్ణములు రకానికితులం

చొప్పున ఆరసంలో కలిపి పూట 1కి తులెచొప్పున 3 రోజులు తాగ
వలెను. చప్పిడి పథ్యము.

386 పచ్చసెగకు లేహ్యము.

నల్లజీడిగింజలు 5 శేర్లు ముక్కలుగాకొట్టి 2 శేర్ల పాలలోవేసి
సగముపాలు యిగరనిచ్చి దానిలో 3 శేర్ల నేయిపోసి పైపాపు శేరు
యినికేటట్టు కాగనిచ్చి వడగట్టి ఆ నేతిలో బెల్లంపొడి 2 శేర్లు వేసి లేత
పాకంగా కాచి శొంఠిపొడి 1 శేరు తెల్లతెగడిపొడి 1 శేరు లవంగ
పొడి 1 తు జీలకర్రపొడి 1 తు ఉసిరికపప్పుపొడి 1 తు పైన చెప్పిన
పాకములోపోసి కలిపి తేనె కొద్దిగా చేర్చి పూట 1కి గచ్చకాయం
తమాత్ర 24 దినములు సేవించవలెను. అధికమైనకారం పులుసు పె
రుగు పాలు కంద అరటికాయలు ఎండలోతిరుగుట దారినడచుట సం
భోగం పనసకాయ పనసపండు ఆవ మామిడి వర్జములు.

387 తెల్లశెగకు చూర్ణము.

యాలకులు లవంగాలు తోకమిరియాలు చీనాపంచదార సమ
భాగములుగా ఆవుమజ్జిగతోనూరి 15 రోజులు దినమునకు 2సార్లుగా
యిచ్చేది. ఇచ్చాపథ్యము,

388 తెల్లసెగకు నమిలేది.

నేలవుసిరికచెట్టు తెల్లజీలకర్ర ఉదయంనమలవలెను. ఇట్లు 15
దినములు చేయవలెను. ఇచ్చాపథ్యము.

389 తెల్లసెగకు చూర్ణము.

1 తు తిప్పసత్తు 1 తు చీనాపంచదార 2 తు ఏలక్కాయలు
1 తు పచ్చకర్పూరం చూర్ణముచేసి 5 పొట్లాలు చేయవలెను. ఇచ్చా
పథ్యము.

### 390 తెల్లసెగకు మాత్రలు పాకము.

కర్పూర శిలాజిత్తు రాతిపండు సమముగాచూర్ణముచేసి ఉండక ట్టకుండ దదరిజడ ఆకురసముతో చూర్ణముకలిపి పెరుగుతో ఉదయ కాలమందు 3 దినములు సేవించవలెను.

### 391 తెల్లసెగకు మాత్రపాకము.

మిరియాలు ముల్లుగోరింటాకు నూరి ఉసిరికాయలంత మాత్రి లుచేసి ఆవుపెరుగుతో కలిపి చప్పిడిపథ్యాన 10 దినములు సేవించ వలెను.

### 392 రక్తసెగకు మాత్రిపాకము.

తుంగముస్తెలు 8 తు పచ్చిపసుపు తు1/2 జాజికాయ తు1/2 జీలకర్రి తు1/2 పురుగుడుచెక్క తు1/2 కలిపినూరి గేదెపెరుగుతో 3 పూటలు పెసరపప్పు అన్నం పథ్యంగా తినేది.

### 393 రక్తసెగకు మాత్రిలు.

యాలకులు 1తు పటికె 1తు సురేకారం 1తు తోకమిరియాలు ½తు దాల్చినచక్క 1తు వీనిని కలబంద రసాన 2 జాములు మర్దనా చేసి సెనగగింజల ప్రమాణం మాత్రలు 5 దినములు సేవించవలెను. కడిచారు బచ్చలి పెసరపప్పు ఆవుమజ్జిగ పుచ్చుకోవచ్చును. నూనె కూడదు.

### 394 రక్తసెగకు ముద్దపాకము.

జమ్మిఆకు ముద్దగానూరి నిమ్మకాయంతగా 2 పూటలు 3 దిన ములవరకు యిచ్చేది ఇచ్ఛాపథ్యము.

### 395 రక్తసెగకు చూర్ణము.

ఉశిరికపప్పు ద్రాక్షపండ్లు ఖర్జూరపుకాయలు అతిమధురంసోపు నాగకేసరాలు దాల్చినీచెక్క ఒక్కొక్కటి తు½చొప్పున చూ

ర్ణముచేసి అందులో పంచదార కలిపి పూట 1 కి ½ తు చొప్పున 2 పూటలు 6 దినములు ఇచ్ఛాపథ్యంగా సేవించవలెను.

396 ఇంకొకవిధము.

ద్రాక్షపండు అరటిపండు మినపప్పు పెన్నేరుదుంప అతిమధురం దినుసుకు 2 తులాలుగానూరివస్త్రగాళితంచేసి దానిలో తు ½ పంచదారకలిపి పూట 1కి తు 4 చొప్పున 2 పూటలు ఇచ్ఛాపథ్యాన సేవించేది.

397 షర్బత్తురకం.

అప్పుడేపిండిన ఆవుపాలు నురగ ఆరకముందే నిమ్మపండ్లరసం పిండి ఆవుపాలనుకలిపి పుచ్చుకొనేది. పూట 1కి శేరున్ను నిమ్మపళ్ళు 2 న్ను ఇట్లు 5 రోజులు ఇచ్ఛాపథ్యాన సేవించేది.

398 రక్తసెగకు చికిత్స.

సాగనారతెచ్చి లోపలి మట్టలోని గుజ్జు ముక్కలుగాతీసి పులిచల్లలో నానవేసి ఆముక్కలుతీసి చీనాపంచదారలో అద్దుకొని ఇచ్ఛాపథ్యాన 5 రోజులు సేవించేది.

399 ఎరుపు తెలుపు పసుపుకలిసిన సెగలకు మాత్రలు.

రససిందూరం రసకర్పూరం ఇంగిలీకం పచ్చిచిత్రమూలం గంధకం సమభాగం తగినంత హంసపాదిరసంతోనూరి కుంకుడుగింజలంత మాత్రలుచేసి పూటకు 2 మాత్రలుగా 5 రోజులు పుచ్చుకోవలెను. మాత్రలు తేనెలో ముంచి గొంతులో వేసుకోవలెను. మ్రింగగానే పదితమలపాకులు కరక్కాయచెక్క పోకచెక్క అరగంటసేపు బాగా నమిలి మ్రింగవలెను.

దీనికిపథ్యం:—కందికట్టు కందిపప్పు చింతపొట్టు బీరకాయ పొట్లకాయ ధనియాలకారం కొయ్యతోటకూర ఆవుమజ్జిగ ఆవుపాలు వాడవలెను. అపథ్యము చేసినచో క్కీళ్లుపడిపోవును.

## 400 తెల్లసెగకు చికిత్స.

చంద్రకాంతదుంప 1తులం యాలకులు ¼తు ఆవునవనీతము తోనూరి 5 పూటలు సేవించవలెను.

## 401 3సెగలకు చికిత్స.

గుంటగలగరచిగుళ్ళు 9 దింటిని. 9 మిరియాలతోనూరి మాత్రలు సేవించేది చప్పిడిపథ్యం. కాల్చిన మిరపకాయ కొరుకొ్కన వచ్చును.

## 402 అన్ని సుఖజాతులకును మాత్రలు

రసగంధకాలు రసకర్పూరం రేకులతాళం సవ్వీరపాషాణము దినుసునకు 1తులం చొ॥ కొబ్బరినీళ్లు తీసివేసి దానిలో పైదినుసుల చూర్ణంపోసి మూడుసార్లు చీరమన్నుకట్టి పుటంపెట్టి తిరిగి కొబ్బరినీళ్లతో నూరి పచ్చిశెనగ గింజంత మాత్రలు యిచ్ఛాపథ్యాన సేవించేది.

## 403 సవాజాతిహర. ఇంగిలీకరసాయనచూర్ణము.

ఇంగిలీకం క్రొత్తపెంకులోవుంచి రెండేసి నల్లజీడిగింజలు ముక్కలుకొట్టి యింగిలీకము కనుపించకుండా కప్పి తెల్లని వత్తులు నేతిలోముంచి ఆముక్కలు వెలిగించవలెను. కాలి మాడిన ఇంగిలీకం 1భాగం పిప్పలి మిరియాలు లవంగాలు సమభాగములు వేసి చూర్ణముచేసిపూట1కి3చిన్నాలప్రమాణం తేనెతోగాని నేతితోగాని సేవించవలెను.

## 404 అగస్త్యకొళంబు.

ఇంగువ ఆవాలు సైంధవలవణం రసం వెలిగారం మణిశిల పిప్పళ్ళు తాళకం నల్లజీలకర్ర సూద్రినాభి యిది ఒకొ్కక్కటి1తులము

న్నూ నేపాళాలు 2 తులాలున్నూ చూర్ణముచేసి దుష్టపురసంతో మర్దనాచేసి దానినివివిధ అనుపానభేధములతో సకలవ్యాధులకు వాడవచ్చును.

405 గండమాలలు గ్రంధులకు.

త్రికటుకచూర్ణం త్రిఫల చూర్ణం మూడేసిపలాలున్ను దేవకాంచనపట్టం 12తులాలున్ను శుద్ధియైన గుగ్గిలపుచూర్ణంచేర్చి తగినంత తేనె కలిసి తులంచొ॥పూటకు సేవించవలెను. ఇచ్ఛాపథ్యము.

406 రక్తపుష్టికి మాత్రలు.

కస్తూరి కుంకుమపువ్వు సమభాగాలుచేర్చి యాలకులు1భాగం నల్లమందు లవంగాలు 4 భాగాలు నీళ్ళతో 3 జాములు నూరి గురిజ ప్రమాణం మాత్రలుకట్టి పులుసువర్జంగా సేవించవలెను.

గృహవైద్యచికిత్సారత్నము.

ప్రథమభాగం

సంపూర్ణము.

# చండిక.

(ప్రదర్శనానుకూలమగు 5 అంకముల నాటకము.)

గ్రంథకర్త:—తులసీదేవి (సతీతులసి) నాటకము రచించిన ముత్తనేని వేంకటచెన్న కేశవులుగారు.

చండిక స్వాతంత్ర్యమంటప ప్రదీపిక, చండిక సౌందర్యవార్ధి సమృద్ధి చంద్రిక, చండిక సముదారాతిద్రుమ కుఠారిక, చండికాచరిత్ర మతివిచిత్రము! సూక్ష్మదృష్టిం బరికించువారికిఁ జండిక భామినీరూప బ్రహ్మరాక్షసి! కామినీరూప మృత్యుదేవత. స్థూలదృష్టిం బరికించు వారికిఁ జండిక వీరపత్నీశిరోరత్నము! పరమసాధ్వీతిలకము. చండిక కౌక్షేయముతోఁ గానిపనిఁ గటాక్షముతో నెఱవేర్చినది. కత్తిబట్టుకొని కదనరంగమున కుఱికినది. రక్తముగార్చి రాజ్యము సంపాదించినది. చండికకు స్వాతంత్ర్యమే స్వర్గలోకము. పారతంత్ర్యమే ఘోరనరకము. భర్తృస్వాతంత్ర్యమునకుఁ జండిక పడినపాట్లు చెప్పినదీఱవు. పతి నిష్ప్రభుం జేయుటకుఁ జండిక పన్నిన తంత్రములు వర్ణనాతీతములు! పతిహితవర్తనమే చండికకు పరమధర్మము. భర్తకొఱకుఁ జండిక పాపభీతి విడిచినది. ఘోరహత్యలు గావించినది! పాంసులయను దుష్కీర్తి నందినది. తుదకు భర్తకు రాజ్యమార్జించినది. కాని కట్టకడకు చండికకు బైటకొంగే పామై కఱచినది. భర్తయే పగఁదలంచి చండికను పగతుర కప్పగించినాఁడు. ఆభిజాత్యసంపన్నయగు చండిక ఆత్మహత్య గావించుకొనినది. ఇంతటి సాహసిక—ఇంతటివీరకాంత--ఇంతటి నెఱజాణ—చరిత్రము మీరిదివఱకుఁ గనివినియుండరు దీనిఁ బఠించియానందింపుఁడు. ప్రదర్శనానుకూలము, శైలికిఁగొన్ని పద్యములు.

శా. పాణిస్థోరకృపాణిఁబూని బలవత్ప్రద్ధి భూభృద్భట శ్రేణిందాఁకి, యసృక్ప్రవం పరల,నుర్విం గార్చినంగాక, యాక్షోణీరాజ్యము కూరభోజ్యమె టువచ్చున్ ముండలట్లిండ్లలో, బ్రాణాశంబడి వేడియక్రువుల, గార్వన్ క్షత్రియగ్రామణీ!

గీ. కత్తిఁబట్టుకున్న నెత్తురోడ్పకయున్న, ఘోరబాధలొంద ! నేరకున్నఁ బ్రాణిహింససేయఁ ! బాల్పడకున్నను । లభ్యమౌనె రాజ్య ! లక్ష్మియొఱక.

ఉ. వారిధిలోన మీనములు వర్తిలుజాడ లెఱుంగుపోల్పడలున్ । భూరితరాంధ్యపుంధునల భూసల నేరెకు జాణలున్, బకల్ । తారలలెక్కడంగలుగు దంటలు ధాత్రిఁగలారు లేరువో । నాకులచిత్తవృత్తులఁ నగందగు నేర్పుగలట్టి దిట్టరుల్.

---